దవ్యసహాయము చేసి తమ భాషాపోషకత్వశీలమును ప్రకటించిరి.

ఋగ్వేదమును భాషాంతరము చేయుచుండినప్పుడు సంస్కృతి సాహిత్యమును బట్టియు ఇంగ్లీషువారు చేసిన పరిశోధనలను బట్టియు హిందూదేశపు పూర్వచరిత్రి వ్రాయవలెనని రమేశచంద్రునకుఁ దోఁచెను. అప్పుడు రమేశచంద్రుఁడు మైమనసింగు జిల్లాయం దుండెను. అచ్చట తగిన పుస్తకభాండాగారము లేనందున కలకత్తానుండి పుస్తకములనేకములు కట్టలుకట్టలుగ తెప్పింపఁబడెను. రమేశచంద్రుఁడు దవురావెళ్ళినప్పుడు అతని పడవయందంతయు వ్రాతప్రతులతోను గ్రంథములతోను అచ్చుచిత్తులతోను నిండుచుండెను. పగటిపూటయందు ఎంతమాత్రము విరామము లేకపోవుటచే రాత్రి భోజనానంతరము నడిరాత్రివఱకును పని చేయుచుండెడివాఁడు. ఒక్కొకసారి యతనికి తెలియకుండనే తెల్లవారుచుండెను. ఇట్లు ఎక్కువగా పనిచేసియుండుట చాల దుడుకుతనమే! అపాయకరమే! కాని తనదేశపుచరిత్ర వ్రాయవలయునను ఇచ్ఛ, నిశ్చయము అతని నిట్టికష్టమునకు పాల్పఱిచెను. చివరకు 1888–1890–వ సంవత్సరముల మధ్యకాలములో ఆగ్రంథము ముగింపఁబడి మూఁడుసంపుటములుగా ప్రచురింపఁబడెను. దీనికి 'ప్రాచీన హైందవ సభ్యత' (Civilisation in ancient India) యని నామకరణము చేసెను. ఇంగ్లీషుభాషలో విపులముగను సమగ్రముగను రచింపఁబడిన హిందూదేశచరిత్ర మిది,

సంస్కృత వాఙ్మయపఠన మతని కెక్కువ ప్రియమై యుండెను. చదువను చదువను జ్ఞానభాండారములును గొప్ప ఇతిహాస గ్రంథములును అగు భారత రామాయణములను ఇంగ్లీషు పద్యములలోనికి భాషాంతరముచేసిన బాగుండునని యాతఁడు దలఁచెను. ఇది గొప్పసాహసమేగదా? అయిన ఆ గ్రంథములలోని దంతయు భాషాంతరము చేయుటకుగాక అందలి ముఖ్యకథలం గైకొని వానిని భాషాంతరముచేసి మధ్యమధ్య చిన్నచిన్న పరాలతో కథాసందర్భమును గలుప నుద్దేశించెను. తన కావ్యమునకు కావలసిన వృత్తములకై ఇంగ్లీషు వృత్తములనన్నిటిని పరిశోధించి తుదకు సంస్కృతములోని 'అనుష్టుప్' ఛందస్సును పూర్ణముగా బోలియుండు నొక ఇంగ్లీషు వృత్తముతో తనకావ్యమును నిర్మింప కడంగెను. అతఁడా పనియందు కొంతయభివృద్ధి జరిపిన తరువాత తాను చేయుకార్యమునుగూర్చి పండిత మ్యాక్సుముల్లరునకు వ్రాసెను. ఆ యాక్సుఫర్డు విద్వాంసుఁ డాకార్యము చాల దుర్ఘటమైనదనియు తొంబదివేల గ్రంథమగు మహాభారతము చదువుట కనువగునట్లు కొద్దిలో వ్రాయుటకు వీలేలేదనియు రమేశచంద్రునకు ప్రత్యుత్తరము వ్రాసెను. కాని రమేశచంద్రుఁడు దృఢప్రతిజ్ఞుఁడగుటచే నెమ్మదిగా పనిచేసి మహాభారతమును ముగింపఁగనే ఒకప్రతిని మ్యాక్సుముల్లరునకుఁ బంపెను. ఆవిద్వాంసుఁడు మహదాశ్చర్యమును అమందానందమును బొందినవాఁడై ఆగ్రంథమునకు ఉపోద్ఘాతమును వ్రాయుటకు ఇయ్యకొనెను.

1898–వ సంవత్సరము ఆగస్టు నెలలో మహాభారతము వెలువడెను; అనంతర మొకసంవత్సరమునకు ఆతని 'రామాయణము' ప్రకటింపఁబడెను. ఈ రెండు ఇతిహాసములను గుఱించి విపుల విమర్శనము చేయుచు రమేశచంద్రుఁడు ఎక్కువ సమర్థతతో వ్రాసిన టీకలు చరిత్రాధ్యయన పరులందఱును చదువఁదగియున్నవి.

భూమిశిస్తులను గుఱించి కర్జను ప్రభువుతో వాదప్రతివాదములు జరిపెను. నాఁటినుండి రమేశచంద్రుఁడు ఆర్థికవిషయ విమర్శనము చేయఁగడంగెను. అందుకై హిందూదేశములో మొట్టమొదలు బ్రిటిషుపాలనారంభమునుండి వివరముకలిగియున్న శాసనలిఖిత గ్రంథము (Blue Books) లను సేకరించెను. అవి దాదాపుగా రెండువందలకు పైగానుండెను. వీనిని బాగుగఁబరికించి హిందూదేశపు భూమిశిస్తులను గూర్చియు, పరిశ్రమలను గుఱించియు, ఆర్థికోదంతమును గూర్చియు, విషయములను అవగాహన చేసికొనెను. అంత ప్లాసీయుద్ధము నాఁటినుండి (1757) ఇరువదవ శతాబ్దోదయము వఱకు హిందూదేశపు ఆర్థికచరిత్రను దెలుపు గొప్పగ్రంథమును రచించెను. ఇవి రెండుసంపుటములుగా ప్రకటింపఁబడెను. మొదటిది 1902 లోను, రెండవది 1904 లోను వెలువడెను. రమేశచంద్రుని యోపిక, పరిశ్రమ, సాహిత్యజ్ఞానమునొక్క సుఫలిత మిదియె. ఇందు పరిశ్రమలను గూర్చియు, వర్తకములను గూర్చియు, చేతిపనులను గూర్చియు విరివిగ చర్చింపఁబడెను. భూమిశిస్తులను గుఱించి

గాని ప్రజలయార్థికస్థితిని గూర్చిగాని ఏమి తెలిసికొనవలెనన్నను పాలకులకును, వారితోడను నిది సోపానమ్యాము.

1900—వ సంవత్సరములో "ఇండియాలో కరువులు" అనునది ప్రకటింపబడెను. ఇందు ప్రతిసంవత్సరము క్షామము వచ్చి జనులెట్లు నశించుచున్నదియు, దానిని వారించుటకు ఉపాయములును వివరింపబడెను; "The lays of ancient India" (1893) అను దానియందు సంస్కృతకవుల గ్రంథములలోని నీతివాక్యరత్నాదుల కింగ్లీషు పద్యములుకలవు, 'ప్రాచీనహిందూదేశము' అను పేరుతో హిందూదేశచరిత్ర కొద్దిలో రచింపబడెను; 'ఇంగ్లండు అండు ఇండియా' ( England and India ) అను పేరుతో నీరెండు దేశముల స్థితిగతులను విమర్శించుచు 1897 లో నొకగ్రంథము వెలువడెను.

ఇట్లు తన యనుభవమును ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ, సంస్కృతము, బంగాళీభాషలయందు తనకుఁ గల పాండిత్యమును ఇతరులవలె మాటలతో పోనీయక తరతరములవాడు తలంచుకొను చుండునటుల రమేశచంద్రుండు గొప్ప గ్రంథములను వ్రాసి కీర్తికాయుఁడయ్యెను. అతనికి ఇంగ్లీషు భాష మంచినీళ్ల ప్రాయముగా నుండెను. ఇంగ్లీషు స్వభాషగాఁ గలవారుగూడ ఈతని శైలికిని, రచనా విధానమునకును, మిగుల అచ్చెరు వందుచుండిరి. ఈతని కృతులన్నిటియందును ఇతని ప్రాచీన హైందవసభ్యత, భారత రామాయణములు, ఆర్థిక చరిత్రము ఈమూఁడును హైంద

పులకోటకు హైందవునిచే వ్రాయఁబడినందున జాత్యాభ్యు దయమునకు ఎక్కువగా తోడ్పడఁగలవు. భారతగ్రంథమాలిక యందు నీ గ్రంథరత్నములు దేదీప్యముగ ప్రకాశించు చుండును.

ప్రస్తుత మాచరణలోనున్న దురాచారము లన్నియు ప్రాచీన గ్రంథములలోని సూత్రానుసరములే యని నమ్మి ప్రాచీనమన్న దానినెల్ల సంఘసంస్కరణ పరాయణులు నేవ గించుచు సర్వము పాశ్చాత్యులనుండియే నేర్చుకోవలె నను నూహాలు ప్రబలియుండిన కాలములో రమేశచంద్రుఁడు జీవయాత్ర మొదలిడెను. సమస్త జ్ఞానభాండారము లగు ఋగ్వేదము, బైబిలు మొదలగు గ్రంథముల నన్నిటిని విమ ర్శన పూర్వకముగ చదివి వానియందెంతో గౌరవభావ మును కలిగియుండెను. ఋగ్వేదమును బంగాలీలోనికి భాషాం తరము చేయుటయు, పూర్వులయందును, పూర్వకట్టడముల యందును, వారి యాచార వ్యవహారముల యందును సద్భా వముగలిగి అందలి మంచినంతను తన గ్రంథములయందు జొనుపుటయు, వారిని కించిత్తయినను ప్రల్లెత్తి దూషింప కుంటయుఁజూచి మనవార లతనిని శుద్ధపరమఛాందస పూర్వా చార పరాయణునిగా భావించిరి. కాని యాతనిజీవితమును బాగుగ పరిశీలించినవారికి పూర్వపాశ్చాత్యాచార సమ్మేళ నమునకై యవతరించిన గొప్పసంఘసంస్కర్త యని స్ఫురిం చకమానదు. తాను సముద్రయానము చేసి, భారతేతరులతో సహపంక్తిని భుజించెను; తనకొడుకు అజయచంద్ర దత్తున

కొక వితంతువునిచ్చి పరిణయముచేసెను. తనకొమార్తెల కందఱకు రజస్వలానంతర వివాహములు చేసెను. విస్తరభీతిచే ఈవిషయమును గూర్చి వివరింపజాలక 'సరళ' యను మూఁడవ కుమార్తెను వరించిన జె. ఎన్. గుప్తగారికి వివాహాత్పూర్వము వ్రాసిన లేఖలోని కొన్నివాక్యము లిచ్చట వ్రాయుట సమంజసమని యత్నము చేయుచున్నాము:—

"నీ సందేశమునువిని మిగుల నానందించితిని. నేనునిన్ను ఇంగ్లండునందు మొట్టమొదట చూచిన నాఁటినుండియు నీయందు సద్భావమును కలిగియుంటిని. నేను నీతో సంప్రతించ లేకపోయినను నీ యభిప్రాయముల నెక్కువ గౌరవించి యుంటిని. వయసున పెద్దవాఁడనను స్వాతంత్ర్యము వహించి నీయుద్దేశములను కొన్నిసారు లాక్షేపించినను, నీఋజువర్తనమును, నీ నిష్కాపట్యమును, నీ దేశాభిమానమును మెచ్చుకొని యుంటిని. ఇవి యన్నియు నీకు తెలిసిన విషయములే. నీ యభిలాషమునకు నేను మనఃపూర్వకముగ సమ్మతించుచున్నాను. నేనీ విషయమును గూర్చి ముచ్చటించినప్పుడు నాభార్యయు తన యంగీకారమును దెలుపు ననుటకెంత మాత్రమును సందేహము లేదు. ఇంతకంటె దగ్గఱ సంబంధముచే మనము పెనవేయఁబడినపుడు నీ జీవితకాలమునందు నేను కొంత సహాయకారి నగుదునని తలంచెదను.

నీవు ప్రాయశ్చిత్తము చేయించుకొని యోగ్యులయెదుట అమర్యాదను పొందుటకు నీ జనకుఁడు సమ్మతించఁ గూడదని

నీవు తలంచుట లేదెను. నీవు దీనిని చేయుటను తిరస్కరించు టయేగాక నీ సహధర్మచారిణి నేర్పాటు చేసికొనుట యందును నీ యిష్టాయిష్టములనే గమనింపఁ గోరుచున్నావు. అయినను ఈ సునిశ్చితములవలెనే నీ జనకుని సమ్మతిపడసి, పితాపుత్రులకుండు ప్రేమను నిలుపుటకుఁగూడ నీవు ప్రయత్నించవలెను. దీనిని నెరవేర్చుటయందు నీ సతి నీకు సహాయము చేయవలెను. ఆమె అత్తమామలయెడ వినయవిధేయతలును, గౌరవమును కలిగి యుండవలెను; అత్తమామల విషయములో హిందువుల ఆచారముల ప్రకారము తప్పక యనువర్తించవలెను. అత్తమామలను కలిగియున్న నా యితర కొమార్తెలిట్లు చేయుదురు:— వారు వారియెదుట ముసుగు వేసికొనెదరు. వారితో నెప్పుడును ఎదుటఁబడి మాటాడరు. వారిపాదములు ముట్టి నమస్కారము చేతురు. తమభర్తల జననీజనకులను గౌరవించుటయందు హైందవాచార పద్ధతులను అవలంబింతురు. నాకది యిష్టము. పూర్వహైందవాచారములను వదలుటచే ఈ కొద్దివిషయములలో పెద్దవాండ్ర మనసుల నొప్పించుట మనకు భావ్యముకాదు. మనము దేనినైనను నొక సదుద్దేశముతో చేయఁబూనినప్పుడు మాత్రమే వారినుండి మనము వేరయ్యెదము. అంతరాత్మ ప్రకారము వర్ణాంతర వివాహములు మన విధ్యుక్త ధర్మము. ఏలయన, వేఱువేఱై క్షీణించియున్న జాతిని తిరిగి యది నేకము చేయును. మఱియు హిందూమహాసంఘమునందు మన మొక చిన్నభాగము. అందు నిది ముందుబోవు

సైన్యము వంటిది. ఆ గొప్పహిందూసంఘము మనసార రొప్పుకొని అనుసరించునట్టుల మన మాఘసన్నమును (వితంతూద్వాహము మొదలగు వానినిగూర్చ) మన చిన్నసంఘము నందు, మెలకువతో శాస్త్రీయ్యము చేయవలెను. నే నిన్ని సంవత్సరములనుండి దీనికొరకు చింతించితినో నుదునజాలను. ఇదివరలో వ్రాసిన నా రెండు నవలలయందును 'సంసార్' అనునది వితంతూద్వాహమును గూర్చియు, 'సాహిత్య' పత్రికయందు కొన్ని ప్రకరణములు మాత్రమే ప్రకటింపఁబడిన 'సమాజ్' అనునది వర్ణాంతర వివాహములను గూర్చియు అనుకూలముగ బోధించుచుండును."

ఉత్తమోత్తమ మగు మానవజన్మమం దెవ్వఁడును సకల కలా ప్రవీణుఁడై మెలంగుట దుష్కరము. ధనముండిన విద్యయుండదు. విద్యయుండిన ధనముండదు. ఈరెండునున్న నే శీల్యముండదు. ఒకనికి రాజసమ్మానము కలుగును. మరి యొకనికి లోకమాన్యము లభించును. ఒకఁడు తన కవితా ప్రాగల్భ్యముచేత లోకమును రంజించును. మరియొకఁడు వాగ్ధాటిచే ప్రజల మనంబుల నాకర్షించును. రాజకీయవిషయములన్న నొకఁడు చెవికోసికొనును. సాంఘిక విషయములన్న మరియొకఁడు ముందంజవేయును. కొందఱికి పరిశ్రమలు ప్రియతమములు. మఱికొందఱికి వేదాంతసూక్తులు అత్యంతప్రియములు. కొందఱికి దాతృత్వమబ్బును. మరికొందఱికి పాండిత్యము లభించును. కాని శ్రీయుత బాబు రమేశ చంద్రుని కన్నిటియందును ప్రవేశము గలిగి; వాని నన్నిటి

యంమును సంపూర్ణజయము నొందుట అత్యద్భుతముగదా? ఉత్తమపరిపాలకుఁడనియు, సంస్కృతాంగ్లేయ వంగభాషా విశారదుఁ డనియు, చరిత్రకారుఁడనియు, నిజమైన దేశభక్తుఁ డనియు, సుగుణగణాలంకారుఁడనియు, సంఘసంస్కరణదక్షుఁ డనియు భరతమాత ముద్దుబిడ్డఁ డనియు, రమేశచంద్ర దత్తు ప్రఖ్యాతిచెందెను. దృఢమైన ధైర్యము, విడువని ప్రయత్నము, అంతశ్శక్తి యందలి నమ్మకము మొదలగు కార్య సాధనోపకరణములకు ఆలవాలమైన రమేశచంద్రుని గంభీర జీవిత మందఱి కాదర్శకము, ఆదరణీయము.



# అజంతా - ఎల్లోరా

## ౧

వేలసంవత్సరాల క్రిందటనున్న మనపూర్వుల సంస్కృతీ, సభ్యత లెట్లుండెనో తెలిసికొనుటకు వారు శ్రద్ధాభక్తులతో నిర్మాణముచేసిన కళాక్షేత్రములే మిక్కిలి ప్రయోజన కరములయియున్నవి. వీనిలోఁ బర్వతముల శిలలను దొలిచి ప్రతిభావంతముగ నిర్మించిన గుహామందిరములు మిక్కిలి యమూల్యములయినట్టివి. ఈ గుహామందిరములు కాలపురుషుని ప్రభావమునకుఁ గొంత తలయొగ్గినను, ఇంకను జెక్కుచెదరక నిలచి యున్నవి. కాలక్రమేణ భరతఖండమునఁ జెలరేగిన మతవైషమ్యములు, రాజకీయ విప్లవములు, ప్రకృతి క్షోభములు వీనిని నిర్మానుష్యముచేసి మరుగు పరచినవి. జిజ్ఞాసాపరులగు మానవులు పర్వతములను, అరణ్యములను శోధించి యీ గుహామందిరములను గనుగొనుచున్నారు. వానిపయిఁ గప్పుకొనియున్న ముసుఁగును దీయుచున్నారు. వాని దివ్యస్వరూపములను దిలకించి ముగ్ధులగుచున్నారు. వానితో ముచ్చటించి యవి మూగభాషలో వ్యాఖ్యానించు తమ కథాంశములను గ్రంథస్థము చేయుచున్నారు. ఆ కథావిశేషములకుఁ జకితులగుచున్నారు. మనపూర్వుల సభ్యతాసాంప్రదాయములకును, ధర్మప్రతిష్ఠకును, సౌందర్య పిపాసకును, ప్రతిభాసంపదకును, లోకజ్ఞానమునకును అచ్చెరువొందు

చున్నారు. ధీమంతులు, ప్రజ్ఞాకుశలులు, అజ్ఞాతనామధేయులు అగు నీ శిల్పబ్రహ్మలకు మన జోహారులు.

ఈ గుహామందిర నిర్మాణవిధానము సుమారు రెండు వేల మూడునూరుల సంవత్సరముల క్రిందటనే ప్రారంభమయినది. బౌద్ధధర్మానుయాయులే యీవిషయమున నెక్కుడభినివేశమును గనుపరచి, ప్రతిభాశాలురయియున్నారు. ఆంధ్ర బౌద్ధులు దక్షిణాపథమున విశేషవిజ్ఞానమును బ్రకటించియున్నారు. అంతియెగాదు. గుహామందిర శిల్పనిర్మాణమునందు ఆంధ్రబౌద్ధులు విశిష్టమయిన యొక సాంప్రదాయమును నెలకొల్పి యాచార్యపీఠము నధిష్ఠించి యున్నారు. ఈ యాంధ్రబౌద్ధుల కళావిశిష్టతను జాటునట్టివియే అజంతా, ఎల్లోరా గుహలు.

అజంతా ఎల్లోరా గుహ లనునవి దివ్యకళా క్షేత్రములు. శిల్పకళాలక్ష్మికి తేజోవిరాజమానములగు నేత్రద్వయము. ఈ కళాక్షేత్రద్వయము హైదరాబాదు రాష్ట్రమున నుత్తరసరిహద్దు భాగమున నెలకొనియున్నవి. హిమాచల, కన్యాకుమారి మధ్యస్థ భూభాగమునందలి కళావిదులకు కళాభిమానులకు దర్శనీయస్థానము లయి ప్రఖ్యాతిచెందియున్నవి. అంతియెగాదు, విదేశ యాత్రికులనుగూడ నాకర్షించుచున్నవి. ఇంక వీనియాధిక్యత యెంతటి ప్రభావంతమయినదో మీరే యూహించుడి.

అజంతా గుహామందిర నిర్మాణకార్యము క్రీస్తుశకము ప్రథమశతాబ్దములోఁ బ్రారంభమయినది. ఎల్లోరా గుహా మందిర నిర్మాణకార్యము క్రీస్తుశకము మూఁడవ శతాబ్దములోఁ బ్రారంభమయినది. ఈ నిర్మాణకార్యము రెండింటి యందును క్రీస్తుశకము ఏడవశతాబ్దము వరకును సాగినది. ఈ దీర్ఘకాలమునం దంతటను గొన్నితరముల శిల్పుల, సిద్ధహస్తులగు తెలుఁగుశిల్పుల ఉలులు తాండవించినవి. సిద్ధహస్తులగు తెలుఁగుచిత్రకారుల కుంచెలు నాట్యముచేసినవి. ఎండకు, వానకు, చలికి మానవుఁడు వశుఁడయి క్లేశదోషములకు గురికాకుండ నిర్మాణములయినట్టి వీగుహాలయములుఁ శాశ్వతబ్రహ్మకల్పముగా నిలుచునట్టి యీయపూర్వహర్మ్యములను నిర్మించుటలో, వానిని సర్వాంగశోభితముగా నలంకరించుటలో నా ఆంధ్రభిక్షువులకు, ఆ యాంధ్రసోదరులకుఁ గల ప్రకృతి వశీకరణశక్తి యెంతఘనమయినదో!

అజంతా, ఎల్లోరా గుహాలకు మధ్యఁగల యంతరము సుమారు ఏఁబదిమైళ్ళు. కావున జంటగా సాగుచున్న యీ నిర్మాణకార్యకరణమున కళాభేదమును సృష్టించుటకు శిల్పులు ప్రయత్నించినట్లు గనఁబడఁగలదు. అజంతాశిల్పులు చిత్రకళావిన్యాసమునకుఁ బ్రాధాన్య మొసఁగి యుండుట గమనించి, తరువాత రెండువందల సంవత్సరములకుఁ బనిప్రారంభించిన ఎల్లోరాశిల్పులు శిల్పకళా విన్యాసమునకు బ్రాధాన్య మొసంగినట్లు తోఁచుచున్నది. వారివారి యాదర్శముల కను

గుణముగానుండు తావులను శిల్పులు వరించియుండుట గమనింపనగును. అజంతా పర్వతము గగ్గులు. గగ్గులుగానుండు మెత్తని రాతిప్రదేశము చిత్రలేఖనమునకును, రేఖావిన్యాసమునకును, సున్నితపుఁ బనితనమునకును ననువగునట్టిది. ఎల్లోరా పర్వతము కఠినపాషాణతలము. గొప్పగొప్ప ఆకారములను, మహాకాయులను, ప్రచండరూపులను జెక్కుటకు యోగ్యమయినట్టిది. అజంతాలో శిల్పకళ లేదనిగాని, ఎల్లోరాలోఁ జిత్రకళలేదనిగాని చెప్పటకు వలనుపడదు. అజంతా గుహలయొక్కయు, ఎల్లోరాలోని మొకటి పండ్రెండుగుహల యొక్కయు శిల్పుల అభిరుచు లొక్కవిధముగనే యుండెను. ఉభయులును కళాకౌశలులే. ఉభయులును మహాయాన బౌద్ధసాంప్రదాయమునకుఁ జెందినవారే. ఉభయులకును బ్రకృతి రామణీయకము లగు నా ప్రదేశములందు సౌందర్య శోభా విలసితములయిన మహోన్నత శిలామందిరములను నిర్మించి ప్రజాబాహుళ్యము నాకర్షించుటయే యభిప్రాయమయి యుండును. అట్లు దర్శించుజనులకు బౌద్ధమతానురక్తినిఁ గలిగించుటయే ధ్యేయముగా నుండియుండును.

ఈ గుహామందిరములందు బౌద్ధమత ప్రవర్తకులగు బిక్షువులు నివసించుచుఁ దమతపోజపాది కార్యకలాపములను నిర్వర్తించుకొను చుండెడువారు. సర్వసంగ పరిత్యాగులయిన బౌద్ధసన్యాసుల కీప్రదేశములు చాల యనుకూలములుగానుండెను. జలపాతము లుండుటచే పానోదకముసమృద్ధి. అరణ్యప్రాంత మగుటచే ఫలాదులు పుష్కలము.

## ౨

ఔరంగాబాదు నగరమున కరువదియారు మైళ్ళదూరమున ఈశాన్యదిక్కుగా అజంతానగరమున్నది. ఇది ఇంధ్యాద్రియను పర్వతముపయి కట్టఁబడినది. అయిదవ శతాబ్దపు టంత్యభాగమున నీనగరము చాళుక్యరాజగు మొదటి పులకేశికి రాజధానిగా నుండియుండునని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. అజంతా ఇప్పుడొక గ్రామము. ఆ గ్రామము నుండి పర్వతముల మీదుగా నాలుగుమైళ్ళు పయనముచేసిన గుహామందిర ప్రదేశమునకుఁ జేరుదుము. ఈగుహాలు వలయాకారపు గుట్టలయొక్క లోపలిభాగమున నున్నవి. ఆలోయ యంతయు నొకగిన్నెవలె నుండును. వలయాకారముగనున్న యీ పర్వతపంక్తియొక్క పశ్చిమపర్వతోపరి భాగమ నుండి వ్యాఘ్రనది వచ్చి యేడుపాయలుగ 99 అడుగుల యెత్తు నుండి లోయలోనికిఁబడి వంకరగాఁ బ్రవహించుచుండును. ఈ నదీప్రవాహము ననుసరించియే యుత్తరతీరమునందు పర్వతసానువులను దొలిచి యర్ధచంద్రాకారమున రమ్యహర్మ్యములు నిర్మింపఁబడినవి. ఎదురుగానుండు జలపాతము మీఁదను, అన్నిఋతువుల యందును బూర్ణమయియుండు నదీ జలప్రవాహము మీఁదను బడెడు సూర్యకిరణముల కాంతి పరావర్తముచెంది, గుహామందరములను బ్రకాశవంతముచేయుట కనువుగానుండు ప్రదేశమది. ఆ బౌద్ధబిక్షువుల విజ్ఞాన మసామాన్యముగదా!

అజంతను ప్రాచీనకాలములో "అచింత" యను చుండిరి. అచింతయనఁగా చింతలేనిది; చింతలను బారఁదోలు నది. బౌద్ధభిక్షువులు ప్రశాంత వాతావరణముగలిగి యైహిక చింతానివృత్తి భూతము లయి, పారమార్థిక జ్ఞానాభివర్ధనము కాకరములగు తమ నివేశనములకు "అచింత" యను సార్థకనామము పెట్టుకొని యుందురు. గుహాలయ శిల్పుల ప్రయోజనార్థమో, బౌద్ధభిక్షుల యవసరములను దీర్చుటకో పర్వతము క్రింద నొక గ్రామము వెలసియుండి యుండును. ఆగ్రామమున కచింతయని యే నామకరణము చేసియుందురు. గుహామందిరము లేదో విపర్యయమువలన నిర్మానుష్యము లయి, విస్మృతి పథమునఁ బడిపోయినను, అచింత గ్రామము జననివాసమయి నిలచియుండును. అచింతగ్రామము అజంతగా నపభ్రంశముఁ బొందుట సంభవించి యుండును. తిరిగి గుహామందిరముల యునికి యీశతాబ్దమున ప్రశస్తికిరాగా అజంతా గ్రామనామమునుబట్టి, యేతద్గ్రామ సమీపమందలి గుహలకు "అజంతాగుహా" లని నుడువుట చారిత్రికముగ సహజాభిధానమే యయియున్నది.

అజంతాగుహాలు ఇరువది తొమ్మిది. ఇం దయిదు గుహాలు చైత్యములు. మిగత యిరువదినాలుగును విహారములు. చైత్యమనగా బుద్ధదేవుని యే దేనొక ధాతుచిహ్నము ప్రతిష్ఠింపఁబడిన యాలయము. దీనికే ధాతుగర్భమనియు, దాగోబాయనియు మారుపేళ్ళు గలవు. చైత్యమునందు భక్తులు సమావేశమయి యారాధనలు సలుపుచుందురు.

విహారమనఁగా బిక్కుల నివాసమందిరములు. జపతపములకు, విద్యాభ్యాసములకు, గోష్ఠులకు నుపయోగించు విశాలాంగణములు.

ఈ యాంధ్రశిల్పికి శిల్పకళలోని ధర్మములు, మర్మములన్నియు బాగుగఁ దెలియును. అంగనిర్మాణపుఁ గొలతలయందును, ముఖవిలాసములను దీర్చిదిద్దుటయందును సత్యాంత ప్రతిభను జాటియున్నాఁడు. ఒకేరాతిలో శూన్యప్రదేశములు, స్తంభములు, దారులు, కవాటములు, గడపలు, చిన్నవిగ్రహాలు, పెద్దవిగ్రహాలు, విగ్రహాలకు సాంప్రదాయానుసారము కిరీటాద్యలంకారములు, గదులు, సభావేదికలు, తొలిచి, మలిచి యద్భుతావహముగఁ జూపఁబడినవి. మతసంబంధము లయినట్టివేగాక, శిల్పితన భావనాపటిమ నుపయోగించి శిల్పచాతుర్యమునుగూడఁ జూపుచు వింతవింత ప్రతిమలను జెక్కియున్నాఁడు. మొదటిగుహలో నొక జంక ప్రతిమగలదు. కాదు. నాలుగుజింకల ప్రతిమ లున్నవి. ఇట్టి తబ్బిబ్బునకుఁ గారణమేనఁగా, నాలుగుజింకల రూపాలు కనఁబడుచున్నవి. కాని యానాల్గింటికి నొక్కటే శిరస్సు. ఏవైపు నుండి చూచినను జింకరూపము ప్రస్ఫుట మగుచుండును.

భారతభూమిలోని యితరగుహాలకును అజంతా గుహలకునుగల భేద మిచ్చటి చిత్రకళావిన్యాసము ప్రస్ఫుటము చేయుచుండును. గోడలయందును, పైకప్పులయందును రంగులలోఁ జిత్రములు వ్రాయఁబడినవి. ఈ చిత్రణములలో దేశీ

యాచార వ్యవహారములు, వస్త్రధారణము, అలంకార విధ ములు, ముఖాకృతులు, సంఘజీవనము చిత్రించి యాంధ్రుల సంస్కృతినిఁ గనఁబరచియున్నారు. ఆసనభంగిమములు, గగనవిహార భంగిమములు, ఆకర్షణీయముగా నుండును. స్వభావానుగుణములను బాగుగ నర్థముచేసికొని హస్త విన్యాసాదులం దాభిజాత్య పద్ధతుల నవలంబించియున్నారు. ఈ చిత్రములలో వీధులు, ఊరేగింపులు, యుద్ధాలు, ప్రేమ ముచ్చటలు, పెండ్లివైభవములు మరణదృశ్యములు, గృహో పకరణములు, యుద్ధోపకరణములు, గృహకృత్యములు నిర్వ ర్తించు స్త్రీలు, గృహాంతర్భాగ దృశ్యములు చూపి యున్నారు. అడవిదున్నను వేటాడుచుండెడు నాశ్వికులు, పెద్దఏనుఁగు మొదలుకొని చిన్నపిచ్చుకవరకుఁ గల వివిధ జంతుపక్షి సంతానములు, నాగుబాములు, ఓడలు, చేఁపలు మొదలగువానినిఁ జిత్రించియున్నారు. చివరకు పచ్చడినూరు బండను, రుబ్బురాతినిఁగూడ వారు మరువలేదు. శిబి, మహా జనక, శంఖపాల, చాంపేయ, క్షాంతివాది, హంస, రురు, విధురపండిత, సుతసోమ, శద్ధాంత, మహాకపి, విశ్వాంతర, శరభ, మాతృపోషక, మత్స్య, శ్యామ, మహిష— ఇత్యాది జాతకముల కథాంశములు చిత్రములలోఁ జూడనగును. బుద్ధ దేవుని జీవితాంశముల దృశ్యములు పెక్కు చిత్రింపఁబడినవి.

పదునారు, పదునేడు సంఖ్యలుగల గుహలు బౌద్ధ విహారముల సౌందర్య మెట్లుండునో తెలుపుచున్నవనియు,

ఇందలి చిత్రములు విశిష్టతాగుణ సంపన్నములయి యున్న వనియు, ఇట్టి చిత్రకళానైపుణ్యము భరతఖండమునం దెచ్చటను గానమనియు రమేశచంద్రదత్తుగారు పొగడియున్నారు. ప్రకృతిస్వభావ సిద్ధముగ నుండునట్లు చిత్రించుటకే అజంతా చిత్రకారులు ఎక్కువగఁ బ్రయత్నించియున్నారు. రేఖారచన కజంత పుట్టినిల్లు.

"అజంతా చిత్రములలో స్త్రీ విగ్రహము ప్రత్యేక ప్రశంసాత్మకము. వారి శిల్పసంపదకుఁ పేరుతెచ్చినది స్త్రీయే. రాణులు, బానిసలు, బిచ్చకత్తెలు మొదలగు పెక్కు తరగతులవా రున్నారు. స్త్రీలు అలంకరించుకొనుచు, శయనించుచు, ముచ్చటలాడుచుఁ గూర్చుండుచు, నిలుచుండుచు మనకు నేత్రానందము గావించుచుందురు. స్త్రీ విగ్రహములను గృహాలంకరణమునకే చక్కగ వినియోగించుకొనియున్నారు. స్త్రీని కళాసాంప్రదాయముల కనుగుణముగాఁ జిత్రింపక వారి సహజభంగిములనే యనువదించినారు. వారి విన్యాసములనుబట్టియే వారి స్వభావములను బ్రకటించుట చాలుననుకొనిరి. ఆమె యాకృతిలోని వివిధములయిన వంపులను, ఆమె నేత్రములనుండి వెలువడు వీక్షణపరంపరను, ఆమె శిరఃకంపన విశేషములను జిత్రించుటకు వారు చాల కష్టపడిరి. ఆమె తన దేహాలంకార రచనారహస్యములను వారికిఁ దెలియకుండఁ దాఁపలేక పోయినది. అజంతా విహారములలో స్త్రీ వ్యక్తియెడఁ గనఁబరచిన యాధిక్యతా గౌరవములు మరెచ్చటను గనఁబడవు. పదునేడవ

గుహాకుడ్యము పయినున్న బిచ్చుకుడుగు బీదబాలికయు సౌందర్యమూర్తియే. వారు స్త్రీని తత్వదృష్టితోనే చూచిరి. ఆమె పదవున కెప్పుడును భంగము రానీయలేదు. ఆమెను చిన్నచూపు చూడలేదు. స్త్రీని వారు పుష్పవలె వాడినారు. ఈపూలవనములో నన్నియు సుశోభితముగ సౌరభము వెదఁజల్లు వికసితమైన గులాబిపుష్పములే. త్రొక్కుడులఁబడ్డ కుసుమ మొక్కటియు లేదు. అజంతా స్త్రీలయందు శీవి, మహిమ మూర్తీభవించి యున్నవి." ♦

"ఈ శిలామందిరములయొక్క నూరారు గోడలను, స్తంభములను మనము తిలకించినప్పు డొక మహానాటకము మన కన్నులయెదుట ప్రదర్శిత మగు చుండును. ఈ మహా నాటకమున రాజశేఖరులు, సాధుపుంగవులు, శూరా గ్రేసరులు, వివిధ వృత్తులయందు మగ్నులగు స్త్రీపురుషులు పాత్రలను వహించియున్నారు. వనములు, ఉద్యానవన ములు, రాజసభలు, నగరములు, విశాలములగు మైదాన ములు, దట్టపుటడవులు గలిగి పెక్కువిధములయి, అద్భుతా వహమయి యొప్పుచుండెడు మహారంగము. ఇంకఁ బైనన్నో దేవదూతలు మహావేగముతో నాకాశమార్గమున సంచా రము చేయుచుందురు. ఇచ్చటి స్త్రీలు పురుషులు గాంభీర్య ముదగ్రిగల శారీరక సంపన్నులు. ఇచ్చటి మృగకులములంద చందములతో నొప్పుచుండెడు శక్తిసంపన్నములు. ఇచ్చటి

---

W E గ్లాడుస్టక్ సోలమన్ రచనకు సంగ్రహము.

పక్షిసంతానములు లావణ్యసీమలు. ఇచ్చటి పుష్పజాతులు నిర్మలాకరములు. ఇట్లు భౌతికసౌందర్యముతో ఆధ్యాత్మిక సంపద పెనవేయఁబడి యుండుట మనము కనుగొందుము. విశ్వ మత్యంత శోభావిరాజమానమయి యానందజనక మగు చున్నది..." O

ఈ బౌద్ధబిక్షువు లెంత సర్వసంగ పరిత్యాగులయినను మానవసృష్టిని, లోకవృత్తమును విస్మరింపలేదు. అజంతా కొండల మధ్య, ఆవ్యాఘ్రి నదీతీరమున వారొక ప్రపంచ మునే సృష్టించుకొని యాప్రపంచములోని స్త్రీ పురుషుల హావభావచేష్టావికారములను దర్శించి యానందించినారు. ఆ జంతుజాలములను ఆ పక్షిసంతానములను వీక్షించి తనివి చెందినారు. ఆ భగవంతుని సృష్టివైచిత్ర్యములను, లీలలను స్మరించి, విస్మయముచెంది హర్షించి, తరించినారు.

## 3

ఔరంగాబాదునకు 17 మైళ్లదూరమున వాయువ్యదిశ యందు ఎల్లోరా గుహామందిరములు ఉన్నతమయిన సహ్యాద్రిపర్వత సానువులయందుఁ దొలచఁబడినవి. ఇచ్చట పెక్కు జలపాతములుగలవు. దిగువను సుమారు 20 మైళ్ళ

O Professor William Rothensteen

వరకు సాంద్రారణ్యము మనోహరమయిన ప్రకృతి సౌందర్యముతో వెలుగొందుచుండును. పర్వతమునకు పెక్కు నూర్ల యడుగుల క్రింద ఎల్లోరామైదానము వ్యాపించియున్నది. ఈమైదానపు ముందుభాగమున నొక యందమయిన కొలను గలదు. ఈ కొలనిచుట్టును చిట్టడవి. తటాకమధ్యమున నొక ద్వీపము వనస్పతీరమ్యమయి కన్నులపండువుగా నుండును. వర్షకాలము తర్వాత జలప్రవాహ సమన్వితమయిన యిచ్చటి ప్రకృతిశోభ మహానంద సంధాయకమయి తనరారుచుండును. పూర్వోక్త వర్ణనాంశములను బట్టి పర్వతోపరిభాగమున మదపుటేనుగువలె నున్న గుహామందిరములలోనికి వెలుతురు, గాలి స్వేచ్ఛగా ప్రసరించుట కనుకూలముగలదు; అంతియె గాదు. ఆరమ్యతటాకముపై పడు సూర్యకిరణముల కాంతియు పరావర్తముచెంది గుహామందిర భాగములను బ్రకాశితము చేయుటలో నెక్కుడుగ నుపకరించుచున్నది. ఎల్లోరా శిల్పులు వరించిన దిట్టి ప్రశాంత,అనుకూల రమ్యప్రదేశము. ఆ శిల్పకళాభిజ్ఞుల సునిశిత బుద్ధివైభవమునకు ప్రబలోదాహరణము.

ఎల్లోరాకు "వెరూల్" అనియు నామాంతర మున్నట్లు తెలియుచున్నది. అయినను, ఎల్లోరాగుహాలకును, ఎల్లోరాగ్రామమునకు మధ్యనొక తటాకముగలదు. ఆతటాక జలపానము చేసినందుననే "ఏలు" అను రాజుగారు దీర్ఘ రోగమునుండి విముక్తులయి నిరామయులయిరట! అంత నా ఏలు రాజుగారు అచ్చట తన నామాంకితముగ నొక గ్రామ

మును కృతజ్ఞతాపూర్వకముగా నిర్మించిరనియు, అదియే ఎల్లోరాగ్రామ మనియు ఐతిహ్యముగలదు. ఈ రాజుగారే ఎల్లోరా గుహలలోని కైలాసమందిరమును నిర్మాణము చేయించి యుండిరట!

ఎల్లోరా గుహామందిరములన్నియు నర్ధచంద్రాకారము గల గుట్టయందుఁ గలవు. ముప్పదినాలుగు గుహలు ఒక మైలుదూరమువరకు వ్యాపించి యుండును. ఇందు బుద్ధునకు సంబంధించినవి పండ్రెండు. హిందూపౌరాణిక గాథలకు సంబంధించినవి పదునేనిమిది. జైనమత స్థాపకుఁడగు మహావీరునకు సంబంధించినవి నాలుగు. ఇవి యన్నియు నిట్టి క్రమముననే యున్నవి. ఈవిధముగా బౌద్ధ, బ్రాహ్మణ, జైన శిల్పసృష్టి త్రివేణీసంగమమువలె ఎల్లోరా గుహలలో వెల్లివిరిసినది.

బుద్ధునకు సంబంధించిన పండ్రెండు గుహలును దక్షిణ దిశయందున్నవి. ఇవి మొట్టమొదటి నిర్మాణములు. వీనియందు ముఖ్యముగా 2, 3, 10, 11, 12 సంఖ్యలుగల గుహలు గణనీయమయినట్టివి. ఈగుహలలో పదియవ గుహ మాత్రము చైత్యము. మిగతవి విహారములు. విహారములలో సాధారణముగా ముందొక విశాలమండపము, దాని వెనుక గర్భగుడి యుండును. గర్భగుడిలో బుద్ధుని విగ్రహ ముండును. బుద్ధుని గంధర్వులగు పరిజనము పరివేష్టించి యుండును ప్రతిమందిరమునందును కుడ్యశిలమీద పెక్కు

చిత్రములు చెక్కఁబడినవి. గుఱ్ఱములు, ఏనుఁగులు, శార్దూల ములు, మకరములు, నెమళ్లు, స్త్రీలు, పురుషులు అద్భుత ముగాఁ జెక్కఁబడినవి. పద్మపాణి, వజ్రపాణి అనువారు బుద్ధసేవకు లయినను వీరిద్దరు బౌద్ధదేవతలే. వీరును పరి వార సమేతు లయి దేవతాధికారముతో కొలువుదీర్చి యున్నట్లు వేర్వేరు అంగణములలో చిత్రములు గలవు. గర్భగుడి తలుపును ఇద్దరు ద్వారపాలకులు, బ్రహ్మాండా కారులు కాచుచుందురు. వీరు వివిధ భూషణాలంకృతులయి యుందురు. వీరిని గంధర్వాంగనలు సేవించుచుందురు.

పదియవ గుహను విశ్వకర్మాలయ మందురు. ఇది చైత్యము. శిల్పనైపుణ్యమును గ్రక్కుచుండెడు వైభవాలం కారములతోఁ గూడినట్టిది. ఇందలి బుద్ధవిగ్రహము 11 అడు గుల ఎత్తుండి, అద్భుతావహముగ నుండును.

ఈ పంద్రెండవ గుహలయందును, బుద్ధుని రూపములు వివిధ పరిమాణములలో వివిధ దశలలో పెక్కు మనకు గోచర మగుచుండును. ఏమందిరము చూచినను, ఏచిత్రము చూచినను అంతట జీవకళ యుట్టిపడుచుండును. ఆ రంగము లన్నియు శిల్పకారుఁడు సృష్టించిన బౌద్ధప్రపంచము.

పదుమూడవ సంఖ్యగల గుహనుండి - బ్రాహ్మణధర్మ గుహామందిరములు ప్రారంభమగును. బ్రాహ్మణ ధర్మసంబం

ధములగు పదునెనిమిది గుహాలయంమను శైవ, వైష్ణవ గాథలు పెక్కు చెక్కబడినవి. మహిషాసుర మర్దని, శివతాండవము, సప్తమాతలు, శివుఁడు, పార్వతి, లక్ష్మి, గణపతి, కాలభైరవుఁడు, చాముండి, వారాహి, మాహేశ్వరి, బ్రాహ్మి మొదలగువారు వాహనారూఢులయి కనుపించుదురు. దశావతార ప్రతిమలు గలవు.

బ్రాహ్మణధర్మ గుహాలన్నింటిలోకి షోడశకళా విలసితమయినది పదునారవ గుహామందిరము. దీనిని కైలాసమందురు. ఈ గుహానికేతనము అత్యుత్తమ శిల్పకళావిశిష్టము. ఆ శిల్పియొక్క భావనాపటిమ మహోదారము.

కైలాసమునకు రంగమహ లనియు నామాంతరము గలదు. ఇది 276 అడుగుల పొడవు, 15 అడుగుల వెడల్పు గలిగియున్నది. మధ్యభాగమున కైలాసేశ్వరుని మందిరము. కైలాసదేవాలయపు పీఠము గొప్పది. ఆ పీఠము ప్రక్కల యందు ఏనుఁగులు, సింహములు, శరభసాళ్వములు పెక్కు భంగిమములలో నొకదాని నొకటి చీల్చి చెండాడుచున్నట్లు చెక్కఁబడినవి. దేవాలయము పై అంతస్తునందుఁ గలదు. దేవాలయము, మంటపము, గజములు, ధ్వజస్తంభములు, గోపురములు, యాత్రిక మందిరములు, వీనియన్నిఁటిపై చెక్కినలతలు, మందిరస్తంభములు, ముందున్న ప్రాకార మధ్యము, అన్నియు నొక్క శైలశిల. ఈ దేవళము నిర్మింపఁ

బడిన కైలాసేశ్వరస్వామి యారాతిలోని లింగమే. దేవాల యము సుమారు నూటయిరువది యడుగుల యెత్తున్నది.

దక్షిణపువైపు ప్రాకారము 118 అడుగుల పొడవుండి 12 గదులతో నొప్పుచున్నది. ఉత్తరపువైపు ప్రాకారము 120 అడుగుల పొడవుండి 12 గదులు కలిగియున్నది. ఈగదు లన్నింటియందును శివలీలలు, విష్ణులీలలు అద్భుతముగాఁ జెక్కఁబడినవి: అన్నపూర్ణ, జతుర్భుజమై, జటాధారిణి యయి కలశముతో లక్ష్మి, కాలభైరవుఁడు, కపాలభైరవుఁడు, నవమోహినీ భైరవుఁడు, సిద్ధయోగినీ భైరవుఁడు, భూపాలభైరవుఁడు, భైరవుఁడు, త్రిశూలపాణి, మహాదేవుఁడు, సదాశివుఁడు వీరభద్రుఁడు—ఈవిధముగా పురాణేతిహాసాలకు సంబంధించిన మూర్తులు చిత్రింపఁబడినవి. దేవాలయపు ముందరిభాగమున రామాయణ, మహాభారత కథలు చెక్కఁబడినవి. దేవాలయ మధ్యభాగములలో చిత్రకళా విన్యాసముకూడఁ గావించినట్లు కొన్నిగుర్తులుకూడఁ గనుపడుచున్నవి. ఇచ్చటి శిల్పకల్పన ప్రపంచాద్భుతము. ఇంతటి మహాద్భుత శిల్పమూర్తిని యేకశిలనుండి చెక్కినారన్న మహాపత్రిష్ఠ యాంధ్రశిల్పులకే చెందవలసి యున్నది. ఈ కైలాసమంతయు భువిపై వెలసిన యపరకైలాసముగా నున్నది. దీనిని సృష్టించిన విశ్వకర్మలు ధన్యజీవులు. ఇక్లే గుహాలన్నియు విశాలము లయి వింతలు గలిగియున్నవి.

జైనగుహాలయములు నాల్గను ఉత్తర దిశయొక్క చివరనున్నవి. వీనియందు జైనమత ప్రాబల్యము కనబడు చుండును. వీనిలో ముప్పదియోటవ గుహ ఇంద్రసభ యను పేరుతో నొప్పుచున్నది. జైనగుహాలయందు మహావీరుడు, జైనతీర్థంకరులు, పార్శ్వనాథుడు, శాంతినాథుడు శ్వేతాం బరులు, దిగంబరులు శిల్పచిత్రాలలో ప్రదర్శితమయినారు. గోమాత, ఇంద్రుడు, ఇంద్రాణి, సరస్వతి, సప్తఫణామండితుం డగు శేషుడు, మొదలగువారి ప్రతిమలు చెక్కబడినవి. జైనగుహాలును కళామూర్తులే.

జైనగుహాలయములను సమీపించువరకు ఈ వర్గము నందు శిల్ప సాంప్రదాయములో మార్పు గోచరించు చుండును.

మూర్తి విన్యాసమునకు, అలంకార శిల్పరచనకు, శిల్పసమయ గాంభీర్యతకు, మనోహర దృష్టాంతములుగా ఎల్లోరాలోని యాంధ్రశిల్పము ప్రకాశించు చున్నది. ఈ గుహా దేవాలయములు వాని ప్రక్కనుండి పోవువారికిం గూడ నచ్చట నవి యున్నవని గ్రహించుటకే వీలులేదు. కాని లోపల ప్రవేశించునరికి జను లద్భుత ప్రమోదమగ్న మానసు లగుదురు.

" అందచందములతో నొప్పారెడు నీ పెగోడాలు చిన్నవి, పెద్దవి అన్నియు బ్రహ్మాండ రూపులగు బుద్ధ

మంతుల (Giants) పనితనమనియు, నిర్మాణకాలము తెలియదనియు జనులు చెప్పెదరు. అది యెట్లున్నను, ఒక్క శిలాఖండమునుండి చెక్కఁబడిన పెక్కుస్తంభములతో, వేలకొలఁది విగ్రహములతో నిండియున్న యచ్చటి విశాల దేవమందిర సమూహములను బరికించినప్పుడు నిక్కముగ నవి మానవశక్తికి మించిన పని యనియే మనము చెప్పవలసి యుండును. ఆ మానవు లనాగరికులు కారు. " అని తేవనాట్ అను పాశ్చాత్య యాత్రికుఁడు ఎల్లోరా గుహామందిరములను బ్రశంసించి యున్నాఁడు.

౪

అజంతా గుహామందిరము లిరువదితొమ్మిది. ఎల్లోరా గుహామందిరములు ముప్పదినాలుగు. అజంతా గుహాలు పూర్తిగ బౌద్ధమతమునకు సంబంధించినవి. ఎల్లోరాగుహాలు బౌద్ధ, బ్రాహ్మణ, జైన– త్రిమత సంబంధములు. అజంతా విహారములలో నాల్గవ గుహామందిర మన్నిటికన్న గొప్పది. 87 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పు, 16 అడుగుల యెత్తు కలిగి మూఁడుద్వారములతో నొప్పుచున్నది. ఎల్లోరాలో రెండవ గుహ గొప్ప పరిమాణము గలది. అజంతాలోని 19 వ గుహ యగు చైత్యము, ఎల్లోరాలోని 10 వ గుహయగు విశ్వకర్మాలయమను చైత్యము బౌద్ధశిల్ప

ప్రావీణ్యమునకు నిదర్శనములు. అజంతాలోని యారవ, పదమూఁడవ గుహలును, ఎల్లోరాలోని పదునొకండవ, పదునారవ, ముప్పదియొకటవ, ముప్పదిరెండవ గుహలును రెండంతస్తులు కలవి. ఎల్లోరాలోని పండ్రెండవ గుహ మూడంతస్తుల విహారము. ఎల్లోరాలోని పదునొకండవ గుహాశిల్పమున బుద్ధమతానురక్తి క్రమముగా జారి, బ్రాహ్మణ మతానురక్తికిఁ దోవనొసఁగుచుండుట గమనీయాంశము. బౌద్ధమతము క్షీణించుచున్న సమయ మది.

అజంతాలో చిత్రకళ యెక్కువ, శిల్పకళ తక్కువ. ఎల్లోరాలో శిల్పకళ యెక్కువ, చిత్రకళ తక్కువ. అజంతాలో శిలాకుడ్యములను నొక్కులు నొక్కులుగఁ జెక్కి, వానిపై రేఁగటిమన్ను, ఇసుక, సున్నము, ఊఁక, ఓషధులు, బెల్లము కలిపి యొక లేపము సిద్ధముచేసి గోడలకుఁ బట్టించెడువారు. అది యెండిన తర్వాత దానినిఁదడిపి, యా తడిమీఁద వర్ణములతో పిపీలికాది బ్రహ్మపర్యంత మొక సృష్టిని చిత్రించినారు. ఎల్లోరాలో రాతినిఁ దొలిచి, మలిచి భూమ్యాకాశములు నిండియున్నట్లు తోఁచు నౌన్నత్యముగల విగ్రహములను నిర్మించియున్నారు. ఎల్లోరాలోని రావణ పరాభవమను చిత్రమూర్తి యిరువది యడుగుల యెత్తున్నది; పదియడుగుల వెడల్పున్నది. ఎట్టి గొప్పచిత్రమో చూడండి! ఇట్టి శిల్పరచనచే ప్రాచ్యశిల్ప సాంప్రదాయకములోనికెల్ల ఎల్లోరా గణ్యతఁ గాంచినది.

అజంతా, ఎల్లోరాలలోని గుహలు మన కందు బాటులోనున్న దివ్యకళాక్షేత్రములు. మీరందరీదివ్య క్షేత్రములకు యాత్రచేసి, బుద్ధదేవుని సాక్షాత్కారము చేసికొని, కైలాసమందిరమును దర్శించి, ఇంద్రసభను వీక్షించి, హిందూ, బౌద్ధ, జైన ధర్మగాథల యాంతర్యమును గ్రహించి, జలపాతంబుల గుఱింకు లిడి, ప్రకృతి కన్యతో మేలమాడి, కన్నులున్నందునకు సఫలము చేసికొని, యాత్రా నందమును బొంది చరితార్థులు కండు.



# పెరుస్యూసు

( గ్రీకు - రోమను పురాణగాథ. )

వేలసంవత్సరముల క్రిందట ఆర్గోసులో అక్రిసియసు అను రాజుండెను. ఇతఁడు కపటి, దురాగ్రహుఁడు, కఠినహృదయుఁడు. వీఁడు తన సోదరుఁడగు ప్రోటిసు నన్యాయముగా దేశభ్రష్టునిఁ జేసెను. ఈ పాతకకృత్యమునకై అక్రిసియసునకు శిక్షగా నాతని దౌహిత్రుఁడు వానిని వధించు నని యొకానొక మహాత్ముఁడు భావిని సూచించెను. అక్రిసియసు భయకంపితుఁడయి తన కూఁతురగు "డానయి"ని- పెండ్లికాని యాపడుచును- ఒక పాతాళమందిరమున బంధించి, పరసహాయము దొరకకుండఁ గట్టుదిట్టములు చేసెను. ఈ యేర్పాటువలన డానయికి వివాహము జరుగకుండుటయు, పురుషసంపర్కము లభింపకుండుటయు, దౌహిత్ర జననమునకవకాశమే యుండకుండుటయుఁ దటస్థించునని యాతఁడు భావించెను.

డానయి రాకుమారి చక్కని యువతి. ఈ తరుణి సౌందర్య విభ్రమవిలాసములను జూచి జ్యూపిటరు మహాదేవుఁ డక్కన్యామణిని మోహించెను. డానయి యిప్పు డొంటరిగఁ బాతాళమందిరమున బంధితయై యుండుట కనుఁగొనెను. ఇదే మంచిసమయము మని జ్యూపిటరు స్వర్ణవర్షరూపమున కవాట

రంధ్రములగుండ లోనికిం బ్రవేశించి యామె యెదుట సాక్షా త్కరించెను. డానయి జ్యూపిటరువలన గర్భవతి యయి యొక నాఁడు మగశిశువును గనెను. ఈ శిశు జననవార్త ఆక్రిసి యసు చెవి సోకినప్పుడు, అతఁ డున్మత్తుఁడయ్యెను. పుత్రికా వాత్సల్యమును, పసికందు వగు నా సుందరబాలునియెడ కని కరమును నావంతయుఁ జూపక, వారిని సముద్రతీరమునకుం గొంపోయి, యొక పుట్టియం దునిచి, సముద్రముపై విడి చెను. ఈ ముష్కరకార్యమునకయి ప్రజలు విలపించిరి. నారీ జన మాతని నాడిపోసిరి.

ఆ బాలెంతరాలా బాలుని నక్కున నొక్కుకొని, పుష్కల దుఃఖముతో నా పుట్టిపైనుండి సాగరతరంగములు త్రిప్పినట్లు తిరుగుచుఁ బెద్దకాలము పయోధిపై పయనిం చెను. తండ్రి పగవాఁ డయ్యెను. భర్త దూరదేశము నందుండి కన్నులకు దూరమయ్యెను. విపన్నయగు నా నారీ మణి దిక్కులేని దయిపోయెను.

డానయికి నిద్రాహారములు కరు వయ్యెను. అయినను ఆ ముద్దుబాలుని ముఖసందర్శనమే యామెకుఁ దృప్తి నిచ్చు చుండెను. ఆమె తన కొమరుని క్షేమమే ప్రాణపదముగా భావించి వానినిఁ గాపాడుకొను చుండెను. ఆమె ప్రయాణ కాలమున హాల్సియోను దినములు వచ్చుటచే జలనిధి నిస్త రంగమయి ప్రశాంతముగా నుండెను. ఆమె యొకనాఁడు మూర్ఛనుండి తేరుకొని చూచువరకు నొడిలో బాలుఁడు

చక్కగ నిద్రించుచుండెను. పడవ యొడ్డునకు వచ్చియుండెను. భూతలమునకుఁ జేరఁగలిగితిమిగదా యని యామె సంతోషించి సహాయార్థము కేక వేసెను.

అది సెఫోరసు అను ద్వీపము. దానిని పోలిడిక్టీసు అను రాజేలుచుండెను. రాజవంశీయుఁడగు డిక్టిసు అను వృద్ధుఁడు చేపలుపట్టుట కాప్రాంతమునకు వచ్చియుండెను. వాఁడు డానయిని చూచెను. ఆమె యాక్రందనమును వినెను. అతఁడు త్వరిత గమనమున నచ్చటి కేతెంచి, డానయిని పడవనుండి యొడ్డునకుఁ జేర్చెను. ఆమె విషాదగాథ నాలించి, కరుణాంతరంగుఁ డయ్యెను. మాతాశిశువుల నా డిక్టిసు తనవెంటఁ గొంపోయి తనయింట వారికి శరణమిచ్చెను. ఆవృద్ధదంపతులు సంతతి లేనివారగుటచే నామెను పుత్రికాప్రేమతో చూడసాగిరి. ఆ బాలుఁడు దేవాంశము కలవాఁడని గ్రహించి, వాని నత్యంత గారాబముతోఁ బెంచుచుండిరి. ఆపిల్లవానికి "పెరుస్యుసు" అని తల్లి నామకరణము చేసెను. మాతాపుత్రు లిద్దరు పదునైదు సంవత్సరములు డిక్టిసు దంపతుల ప్రేమ చూరఁగొనుచు నెట్టి యిడుదొడుకులు లేకుండ సౌఖ్యముగ నుండిరి. పెరుస్యుసు పెరిగి పెద్దవాఁడయి, సుందర యువకుఁడయి, పరాక్రమశాలియయి కుమారలోకమున నాయకమణిగా ప్రకాశించుచుండెను.

ఆ ద్వీపము నేలు రాజు, పోలిడిక్టిసు అని చెప్పియుంటిమి గదా! ఆరాజు నిరంకుశుఁడు, దుర్నీతిపరుఁడు, విషయ

లోలుఁడు. అతఁ డొకనాఁడు డిక్టిసునింట డానయినిఁ జూడఁ దటస్థించెను. ఆమె రూపలావణ్యములకు ముగ్ధుఁడయ్యెను. ఆమెను వివాహమాడ సంకల్పించెను. కానియామె యాతనిఁ దిరస్కరించెను. తనకొమరుని, జనకుని జూచునాశ యామెకు లేకున్నను తనయుని క్షేమమే లక్ష్యముగా నుంచుకొని, యామె యింక నెవ్వరిని నొల్లకుండెను. పోలిడిక్టిసు మనోరథము భగ్నమయ్యెను. అంత వాఁడు మండిపడెను. తన రాజ్యాధికార బలముతో నామెను దనయింట బానిసగాఁ జేసివైచెను. డానయి రాజుగారి యింటఁజేరి చాకిరిచేయుచు పెక్కుఅవస్థలకు గురియయ్యెను. బావిలోనుండి నీరుతోడుట, పిండివిసరుట మొదలగు కార్యములు చేసిచేసి యామె యలసిపోవుచుండెను. ఒక్కొకసారి యామెకు ప్రహారములు కూడ తగులుట కలదు.

డానయి జీవితములో నీ విపరీతపు మార్పు జరుగుచున్నప్పుడు పెరుస్యూసు గ్రామాంతరమునం దుండెను. అతఁడు తిరిగి సెరిఫోసునకు వచ్చి,తనతల్లి బానిస యయ్యెనని గ్రహించెను. క్రోధఘూర్ణిత మానసుఁడయి యాతఁడు రాజమందిరమునకుఁ బోయెను. హుటాహుటి రాణివాసములో దూరెను. ఎవరును నాతని నడ్డగించుటకు ముందునకు రారయిరి. ఆతని దూకుడు చూడఁగనే యందరకు ధైర్యము జారిపోయెను. పెరుస్యూసు రాజమందిరాంతరమున నొకచోటఁ బిండి విసరుచుండిన తల్లినిఁ జూచెను. తన తల్లిని రెక్కపట్టుకొని లేవనెత్తి, తనవెంటఁ దీసికొని పోసాగెను. అప్పుడు

పోలిడిక్టీసు నిప్పులు గ్రక్కుచు నాతని కడ్డమువచ్చెను. పెరస్యూసు "ఓకీ ! దురాత్మా ! ఇదియా నీవు దేవతలయెడఁ జూపు తాత్పర్యము! ఇదియా నీవు దిక్కులేని యబలాజనము నెడఁ జూపు సౌజన్యము! ఛీ! నీవు బ్రదుకఁగూడదు." అని హుంకరించుచు, తనయొద్ద కత్తి లేకుంటచే నచ్చటనున్న యా విసరురాతినే యెత్తి వానితల పగులఁగొట్ట నుంకించెను. ఆ సమయములోఁ దల్లియుఁ బెంపుడు తాతయు నడ్డమువచ్చి యట్టికార్యము జరుగకుండఁ జేసిరి. వారట్లడ్డపడ కుండినచో పిరికియగు పోలిడిక్టీసు కథావశేషుఁడయి యుండియుండును. పెరస్యూసుయొక్క వీరపటాటోపమును జూచి పోలిడిక్టీసు భయభ్రాంతుఁ డయ్యెను. ఆమె పోక కడ్డము రాకుండెను.

ఇట్లు మార్గము సుగమ మగుటచే పెరస్యూసు తనతల్లిని డిక్టీసు గృహమునకుఁ దీసికొని పోయెను. అచ్చట ముందు కర్తవ్య మాలోచించిరి. తుదకు డిక్టీసుదంపతుల సలహాప్రకారము డానయిని దేవాలయమునకుఁ గొంపోయి, యచ్చటి పూజారిణి కామె నొప్పగించిరి. ఆమె డానయిని దేవళపు సమ్మార్జకురాండ్రిలో నొక్కతెనుగా నియమించెను. ఆ కాలపు విశ్వాసము, ఆచారము ననుసరించి దేవసేవికల కెవ్వరు నెట్టి యపచారమును జేయఁజాలరు. పోలిడిక్టీసునకుఁ గూడ నలవియే. డిక్టీసుదంపతులును, పెరస్యూసును ప్రతిదినమును గుడికి వెడలి యామెను విచారించు చుండెడువారు.

పోలిడిక్టీసుకు మనోరథభంగము, గర్వభంగము సంభవించెను. ప్రతీకార చర్యను దీసికొనుటకు పెరుస్యూసును జూచి యాతఁడు భయపడుచుండెను. పెరుస్యూసు తన కంటి యెదుట నున్నంతకాలము తనయాటలు సాగవని తలంచెను. ఆతని విరుగడ చేసికొనుటకు వ్యూహము పన్నెను. అంత వరకు నడచిన వికృతకథనమును మరచినట్లు నటించెను. పెరుస్యూసు పరాక్రమాతిశయములను బొగడుటకుఁ బ్రారంభించెను. కొంతకాలమునకు వేడి చల్లారిన తరువాత మెడ్యూసా తలనరకి తెచ్చి, వీరపతకమును బొందుమని పెరుస్యూసును బ్రోత్సాహపరచెను. రాజుయొక్క యీ మాయమాటలకు నుబ్బిపోయి, ముందు వెనుక లారయక పెరుస్యూసు మహోత్సాహముతో మెడ్యూసాశిరఃఖండన కార్యోద్యోగమునకు సమ్మతించెను.

౨

ఫోర్సిను, సీటోదంపతులకు మెడ్యూసా, యుర్యాలె, స్థెనో అను ముగ్గురు తనయలు,సుందరాంగు లుండిరి. వీరొకసారి మినర్వాదేవి గుడిలోనే యా పవిత్రమందిరముననే నెప్ట్యూనునకు తమ శీలములను సమర్పించి సంతోషచిత్తలయిరి. ఆ పవిత్రప్రదేశమున నట్టి యపవిత్రకార్యము జరిపినందులకా దేవికి నాగ్రహముజనించి వారిని శాపోపహతులం

గావించెను. ఆ మువ్వురువనితలును భయానక రూపము లతో సముద్రములోని యొక దీవిగడ్డపై నివసించుచుండిరి. మెడ్యూసా మరణ శీలముగలది, మిగత యిద్దరును మృతిలేని వారు. ఈ ముగ్గురిని సాముదాయకముగా గార్గను లని పిలుతురు.

ఒకప్పుడు సుందరాంగులుగా నున్న యీస్త్రీలు శాప వశమున సగము స్త్రీరూపము, సగము సర్పరూపము కల వారయిరి. వారల ముఖము లందమయిన వేకాని, శరీరములు వికృతమయి యసహ్యాకర మయినట్టివి. వారికిఁ జర్మమునకు బదులుగా పొలసు లుండెను. వారిచేతులు లోహమయము. అన్నిటికంటె భయంకరమయినట్టివి వారి శిరస్సులు. శాపోప హతులగుటకు ముందు వారి శిరోజములు సొగసుగానుండి యుండెను. ఆ శిరోజముల యందచందములకు నెప్ట్యూను దేవుడు మురిసి ముచ్చటపడియుండిన వాఁడగుటచే, నా వెం డ్రుకలను మినర్వాదేవి పాములుగా మార్చెను. అందుచే శిరస్సుపై వెండ్రుకలకు బదులుగా విషసర్పములు బుస్సు బుస్సు మనుచు నాలుక లాడ్చుచుండును. వారు తోకతోఁ గాని చేతులతోఁ గాని దెబ్బ కొట్టినయెడల ఎట్టిప్రాణియు బ్రదుకఁజాలదు. అన్నిటికంటెను హానికరములగునవి వారి కన్నులు. ఆకన్నులు విపరీతమయిన శక్తి కలవి. ఎవరి దృష్టి యయినను వారి ముఖములపై పడినచో వారు వెంటనే శిలలుగా మారిపోయెదరు.

ఇట్టి వర్ణనావిశేషముగల మెడ్యూసాగార్గను తలను ఖండించి తెచ్చుటకు పోలిడిక్టిసురాజు పెరుస్యూసును నియోగించెను. మెడ్యూసా ఘోరవనిత యనియు, ముఖము చూడకుండ తలనరికుట కష్టమనియు రాజు తలంచెను. ఈ కార్య ప్రయోగములో పెరుస్యూసు గార్గను ముఖముచూచి నశించునని రాజు భావించెను.

పెరుస్యూసు యౌవనగర్వముతో రాజు నియోగమును నిర్వహింపఁ బూనుకొన్నను, ఆ కార్యము ఎంతకష్టసాధ్యమయినదో, ఎట్టి దుష్ఫలితములు కలదో క్రమముగాఁ బొడకట్టసాగెను. ఈ గార్గను ఎచ్చటనున్నదో వానికిఁ దెలియదు. అచ్చటికి చేరుటెట్లో తోఁచుటలేదు. తరువాత దాని తలనరకుట కుపాయము కనఁబడుటలేదు. పెరుస్యూసు ఎంత ధైర్యసాహసాది శక్తిసంపన్నుఁడయినను, ఇట్టి దుర్ఘట కార్యకరణమునఁ గర్తవ్యముతోఁపక తన దుడుకుతనమునకు మిగుల విచారపడసాగెను.

ఇట్లు కింకర్తవ్యతా మూఢుఁడయి, విచారమగ్నుఁడయి యొకానొక నిర్జనప్రదేశమున చదికిలఁబడియున్న పెరుస్యూసు నొద్దకు నొక వింతమనుష్యుఁడేతెంచెను. వాని చూపులు కొంటెతనమును బ్రకటించుచుండెను. వాని నెత్తిపయి వికృతపు కుళ్లాయి మెరయుచుండెను. వాని కాళ్ళయందు రెక్కలుగల వింతపాదుక లమరియుండెను. వాని చేతియందు సర్పపరివృతమయిన దండము వినోదముగా

నుండెను. ఈ వింతమనుష్యునిఁజూచి పెరస్యూసు ఆశ్చర్యపడెను. అతఁడు జ్యూపిటరు మహాదేవుని కుమారుఁడగు మెర్క్యూరిదేవుఁడని పెరసుసుకుఁ దెలియదు గదా! మెర్క్యూరి యొక్క దయావీక్షణములు, సానుభూతి వచనములు పెరస్యూసుకు, గొంత ధైర్యమును, చనవును పురికొల్పగా తనకథ నంతయు నా దేవునకు వివరించెను. మెర్క్యూరి వానికి నేతత్కార్య నిర్వాహణమున సహాయము చేయుదు నని వాగ్దానముచేసి, వాని నుత్సాహపూరితుం గావించెను.

పెరస్యూసును బంధుజనులు త్యజించినను దేవతలు వానినిఁ గనిపెట్టుచునే యుండిరి. మెడ్యూసా వధోద్యోగమున దేవతల సహాయము వానికిఁ బూర్ణముగ లభించెను. ప్లూటో శిరస్త్రాణము నొసంగెను. దానిని ధరించినవాఁ డితరులకుఁ గనఁబడఁడు. మినర్వాదేవత డాలు నొసంగెను. అది సువర్ణప్రకాశము కలది. అద్దమునందువలె నందు వస్తువుల ప్రతిబింబములు కనఁబడును. మెర్క్యూరి చంద్రాయుధమును, రెక్కలుగల పాదుకల నొసంగెను. చంద్రాయుధమును, పక్షివేగమును మించిన వేగముతో విసర నగును. రెక్కల పాదుకలతో నాకాశమార్గమునఁ బ్రయాణము చేయ నగును.

ఇప్పు డాతనికి మెడ్యూసా యునికిప ట్టెచ్చట నున్నదో తెలిసికొనుట యవసర మాయెను. ప్రపంచములో నా దీవిగడ్డ

యునికిఁ దెలిసినవారు ఒకగుహలో నివాసమున్న ముగ్గురు స్త్రీలుమాత్రమే.

ఈ వనితల దొక వింతసృష్టి. వారినిఁగూర్చిన విచిత్ర మేమనఁగా, నొక్కొకరకు రెండేసి కన్నులుండుటకు బదులుగా వారి ముగ్గురకుఁ గలిసి యొక్కటే కన్ను. ఈ కంటిని వారు మార్చిమార్చి యొకరితరువాత నొక రుపయోగించుకొనుచుందురు. కావున ఆ కంటినొకరు కలిగియున్నపుడు మిగత యిద్దరేమియుఁ జూడఁజాలకుందురు. ఆ కంటి నొకరి యొద్దినుండి మరియొకరికి మార్చుకొనునప్పుడు ఆ మధ్యకాలములో ముగ్గురును గ్రుడ్డివారగుదురు. ఆ కంటితో వారెంత దూరమయినను చూడవచ్చును. ఈ కారణమున మెడ్యూసా నివాస మెచ్చట నున్నదో వారు సులభముగాఁ దెలిసికొనఁగలరు.

ఈ ముగ్గురు స్త్రీలున్న గుహానొద్దకు మెరిక్యూరియు, పెరుస్యూసును వెడలిరి. పెరుస్యూసునకుఁ గొంతబోధించి, మెరిక్యూరి దూరముగాఁ దొలఁగి దాఁగియుండెను. పెరుస్యూసు గుహసమీపమునఁ బొంచి యుండెను.

ఇంతలో నొక ఫాలాక్షి తన చెల్లెండ్ర నిద్దరను నడిపించుకొని బయటకు వచ్చెను. వారికి దూరదూర ఖండములలో జరుగుచున్న వింత విషయాలను వివరింపసాగెను. వారును తద్దర్శన కుతూహలులయి యాకంటిని తన కీయు

మనియు, తనకీయుమనియు, తన వంతనియు, తన వంతనియు నంథస్త్రీ లిద్దరు గడబిడ చేయసాగిరి. "ఉండండమ్మా! ఆ పొదచాటున నెవరో యున్నట్టున్నది. నన్ను చూడ నియ్యండి." అని ఫాలాక్షి పలికెను. ఈ మాటలు విని పెరుస్యుసు విభీతుఁడయ్యెను. కాని కంటికొరకు వారు తగవులాడుచుఁ బెనఁగులాడఁ జొచ్చిరి. చివర కానేత్రధారిణి యానేత్రమును ఫాలమునుండి తీయవలసి వచ్చెను. అప్పు డా ముగ్గురును గ్రుడ్డివార లయిరి. అట్టి సమయముకొరకు వేచి యుండిన పెరుస్యుసు ఒక్క గంతువైచి యా కంటిని లాగుకొనెను. తమలోనొక్కరు దానినిగ్రహించినట్లు భావించిరొకరిపై నొకరు నిందలు మోపుకొనుచు వారు భయంకర ధ్వానములు చేయఁసాగిరి. వారి కోలాహల మెట్లు పర్యవసించియుండునో చెప్పఁజాలము. కాని, యింతలో పెరుస్యుసు "వనితలారా! మీకన్ను నాయొద్ద భద్రముగా నున్నది. భయపడకుఁడు." అని కేకవేసెను. అంత నిజము తెలియఁగనే క్రోధావేశముతో వారు ముగ్గురును సవ్వడినిఁబట్టి పెరుస్యుసుపై దుమికిరి. పెరుస్యుసు మెలకువతోనుండి పాదుకల ప్రభావమునఁ బైకెగిరి ప్రక్కగా నిలుచుండి "మెడ్యూసాగారను నివసించు దీవిమార్గమును దెలిపినఁగాని మీకన్ను మీకు దొరకదు సుమా!" అని పెరుస్యుసు అరచెను.

ఈ మార్గ మావనితలకు మాత్రమే తెలిసిన రహస్య విషయము. అట్టి రహస్యమును దెలుపుట వారి కెంత మాత్రము రుచింపని విషయమే. కాని, యమూల్యమగు

కంటిని వదలుకొనుట యెట్లు? వారిలో వారు మంతనము సల్పుకొని, పెరుస్యునకుఁ గావలసిన విషయమును సమగ్రముగాఁ దెలిపిరి. వారి మనస్సులు కుదుటఁబడు నట్టులుగాఁ గంటినొసంగి, పెరుస్యుసు మెరిక్యురి యొద్దకు వచ్చెను. పెరుస్యుసు పరమోపకారియయిన యీవింత మనుష్యునకు ధన్యవాదము లర్పించి, యాతనియొద్ద సెలవు గైకొని ప్రయాణోన్ముఖుఁ డయ్యెను.

పెరుస్యుసు పాదుకల ప్రభావమున నాకాశమార్గమున గొప్ప వేగముతో పయనించు చుండెను. ఎన్నో భూఖండములు, సముద్రములు దాఁటి తుదకు గార్గనులున్న దీవిపైకి వచ్చెను. అతఁడు క్రిందికిఁ జూచుటకే భయపడెను. ఆతని డాలే యాతని కద్దముగా నుండెను. దానిలో నాగార్గనులు ముగ్గురు సముద్రతీరమునందుఁ బరుండి యున్నట్లు కనఁబడెను. మినర్వా చెప్పిన గుర్తుప్రకారము మెడ్యూసాను గుర్తించి, చంద్రాయుధమును గేలధరించి, డాలులో మెడ్యూసా ప్రతిబింబమును జూచుచుఁ గ్రిందికిఁ దిగెను. ఒక్క వేటుతో మెడ్యూసా శిరమును ఖండించి దానినిఁ జేతితో వెనుకవైపుగాఁ బట్టుకొని, తోలుసంచిలోఁ దానిని భద్రపరిచి మరల పైకెగిరెను. పాముల బుసబుస ధ్వనులు మిగత నిద్దరును మేల్కొలుపగా వారు వానిని వెంటనంటుటకుఁ బ్రయత్నించిరి. కాని ప్లూటో యిచ్చిన శిరస్త్రాణ మహిమచే వారి కతఁ డదృశ్యుఁ డయ్యెను.

ఇట్లు కృతకృత్యుఁడయిన యా వీర పెరుస్యుసు ఆకాశ మార్గమున స్వదేశోన్ముఖుఁడయి పోవుచుండెను. అట్లు పోవుచుండగా నొక సముద్రతీరమున నొక విషాదసంఘటనము వానిదృష్టికి తగిలెను. వెంటనే యతఁడు భూమిపైకిఁ దిగెను.

## 3

సీఫియసు అనువాఁడు ఎథియోపియా దేశపు రాజు. ఆతని రాణి కాస్సైయోపి. ఈ రాజదంపతులకు అంద్రోమెడా యను తనయ యుండెను. కాస్సైయోపి రాణి లావణ్యసీమ. ఆమె తన యందచందములకే మిక్కిలి మురియుచుండును. ఈమెను మించిన లావణ్యవతి యీమె కూతురు అండ్రోమెడా. కావున కాస్సైయోపి తన కొమరిత సౌందర్యము ముందట సాగరసుందరుల రూప వైభవము దిగదుడుపని డంబములు పలుకసాగెను. సాగరకన్యల సౌందర్య మసామాన్యమయి యుండఁగా నామె యట్లీసడింపుగా పచించినందులకు సాగరవల్లభుఁడగు నెప్ట్యూను కుపితుఁడయ్యెను. ఎథియోపియా దేశమును, ప్రజలను నాశనము చేయవలసినదిగా జల నిధి మహానాగమున కాజ్ఞ చేసెను.

ఆ మహాసర్పము ప్రతిదినము వచ్చి చేయు బీభత్స మింతయని యంతయని చెప్పనలవికాదు. ప్రజల ప్రాణమానములు దుర్భరస్థితిలో నుండెను. ప్రజలు నిరాశాపూరిత

మనస్కులయిరి. ఇట్టి సంకటమునకుఁ గారణమేమి? ఈ సంక టమునుండి తప్పించుకొనుట యెట్లు? అను విషయములను దెలిసికొనుటకు ప్రజలు దేవాలయమునకుఁ బరువెత్తిరి. దేవతల ప్రీత్యర్థము బలిదానాదులు సమర్పించిరి. దేవాలయ ములోని గణాచారి యిట్లు సోదెచెప్పెను:—

"కాసైయోపి గర్వోక్తులే యీ సంకటమునకుఁ గార ణము. ఆమె తన తనయయగు ఆండ్రొమెడాను జలనిధి మహా నాగమున కెరగా సమర్పించిన యెడల నెప్ట్యూను దేవుఁడును, సాగరసుందరులును దృప్తి చెందెదరు. తర్వాత మహానాగము మిమ్ములను బాధింపదు."

ఈ వచనములు ప్రజల కత్యంత సంతాప జనకము లయ్యెను. ఏలయన ఆండ్రొమెడా చక్కదనమున కిక్క. సౌజన్యమునకు నిధి. ప్రజలందరామె నల్లారు ముద్దుగాఁ జూచుచుండిరి. ఇక కాసైయోపికో నెత్తిన పిడుగు పడినట్లు లయ్యెను. తన యపచారము మూలకముగా నన్నుల మిన్న యగు కొమరిత బలియగుట యామెకు దుర్భరముగా నుండెను. ఆమె దేవాలయమునకుఁ బరువెత్తి గణాచారినిఁ బ్రార్థించెను. ఎట్టి త్యాగము నయినను జేసెదను, మీ ప్రత్యు త్తరమును మార్చివేయుఁడని బ్రతిమిలాడెను. కాని గణా చారి గత్యంతరము లేదని పలికెను. ప్రజలు సుఖముగా నుండవలయు నన్నచో నాండ్రొమెడా మహానాగమునకు బలికావలసినదే యని నొక్కి చెప్పెను. కాసైయోపి యేమి

చేయఁగలదు? ఈ ఘోరకార్యమును జూడఁజాలక రాజును, రాణియు నంతఃపురమునఁబడియుండి రోదనము చేయసాగిరి. ఆంద్రోమెడా మానసము వ్యాకుల పాటుతో నిండియున్నను, ప్రజల క్షేమార్థము తనప్రాణము బలిగా నొసంగుటకు సిద్ధగా నిలుచుండి యుండెను.

గణాచారి యాదేశము ననుసరించి ప్రజలు దుఃఖముతో నాండ్రోమెడాను సముద్రతీరమునకుఁ గొంపోయిరి. ఆమెను గొలుసుతో నొకరాతికి బంధించిరి. జనులందరు విచారపూరిత మనస్కులయి యామె చుట్టును మూగి విలపించుచుండిరి. తమ దేశములోని కన్యారత్నమును దిగమ్రింగనున్న మహావ్యాళ మెప్పుడు వచ్చునోయని భయవిహ్వల చిత్తములతో నిలుచుండిరి.

వారట్లు చూచుచుండఁగా సముద్రమునం దల్లంత దూరమున నొకనల్లని రూపము నీటిపై కనఁబడెను. అదియే యా కన్యపాలిటి మృత్యుదేవత యని వారెరుఁగుదురు. అది క్రమక్రమముగా దగ్గరకు రాసాగెను. ఆంద్రోమెడాను కట్టియున్న శిలను సమీపించు చుండెను. అందరు గొల్లుమనిరి. ఆండ్రోమెడా యాక్రందనము చేయసాగెను. ఆ భయంకర దృశ్యమును జూడఁజాలక జనులు దూరమునకు జరిగి చేతులతోఁ గన్నులు మూసికొనిరి.

మెడ్యూసా వధానంతరము పెరుస్యూసు గగనమార్గమునఁ బోవుచుఁ జూచిన విషాదసంఘటన మిదియే. పెరు

స్యుసు భూమిపై దృష్టి సారించినప్పుడు బంధితురాలయి యున్న కుసుమకోమలి, జనుల హాహా రావములు, మహా సంరంభముతో వచ్చుచున్న మహానాగమును వానికి దృష్టి గోచర మయ్యెను. "ఓహెూ! ఏమి యీఘోర"మని సాను కంప శీలముతోఁ దన కేలనున్న చంద్రాయుధమును జళిపించుచు నొక్కయుదుటున భూమికి డిగ్గి మహానాగమును గొట్టెను. మహానాగముమాత్ర మేమయిన తీసిపోవునదా? అది రోషానల జ్వాలలు గ్రక్కుచు పెరుస్యుసు నెదుర్కొనెను. ఘోరముగా పోరాటము సాగెను. తలవని తలంపుగా లభించిన యీ సహాయమునకు ప్రజలు సంతోషించిరి. మహావీరునకు, మహానాగమునకు జరగుచున్న యీ భయంకర యుద్ధము వారి నాశా నిరాశలపాలు గావించుచుండెను. పెరుస్యుసు కొంతవర కట్లు పోరాడి చివరకు గార్గను ముఖమును జూపి మహానాగమును శిలాకృతి గావించెను. ఆ భయంకర మహాసర్పము ప్రాణహీనమయి నల్లరాయివలె నీటిలో నుండగాఁ జూచి జనులు సంతోష కోలాహలములు దిక్కులు పిక్కటిల్లునట్లు గావించిరి. పెరుస్యుసు ఆండ్రొమెడా కట్లు విప్పించెను. ఈ సంతోషవార్త రాజునకు, రాణికి వెంటనే తెలిసెను. రాజదంపతు లానందభరితులయి మేళతాళములతో వచ్చి పెరుస్యుసునకు స్వాగతము చెప్పిరి. గండమునుండి కడతేరిన ఆండ్రొమెడా సందర్శనము రాజదంపతులకే గాక ప్రజలకును మహానంద సంధాయక మయ్యెను. ఎచ్చటఁ జూచినను పెరుస్యుసు పరాక్రమాతి

శయము లుగ్గడింపఁ బడుచుండెను. ఎథియోపియా ప్రజల ప్రాణదాత యగు దేవునిగా పెరుస్యుసును సంభావించిరి.

సీఫియసు క్రైస్తవయోపుల యతిథిగా పెరుస్యుసు కొన్నినాళ్ళచ్చట నుండెను. ఈ కాలములో అండ్రొమెడా యెంతటి సౌందర్యసంపద కలదియో అంతటి సుగుణసంపద కలది యని యాతడు గ్రహించెను. ఆమెను వరించి, తన మనోభావమును వెలువరిచెను. అండ్రొమెడాయు నతనిని ప్రథమ వీక్షణముననే వరించియుండెను. రాజును రాణియు సంతోష పూర్వకముగ నంగీకరించిరి. మిన ర్వాకోరిక ననుసరించి సెప్ర్యును శాంతించి యా దేశమునకుఁ బీడను దొలఁగించెను.

ఆ రాజుగారి కొకసోదరుఁ డుండెను. ఆ రాజసోదరుని కొడుకునకు అండ్రొమెడా నిచ్చి పెండ్లిచేసెద నని రాజు మాట యిచ్చియుండెను. రాజసోదరుఁడగు ఫినియసు తన కొమరులను, యోధపరివారమును వెంటఁబెట్టుకొని యొక నాఁడు వచ్చి రాజును సంబోధించి యిట్లు పలికెను:—

"ఓయీ! నీవీ బాలికను నీ క్రొత్తవానికి నిచ్చిపెండ్లి చేయుటకు వీలులేదు. ఈతని యూరుపేరులు మనకు తెలియవు. అండ్రొమెడాను నా కొమరునకు నిశ్చయించి యుండ లేదా? ఇప్పు డామె సజీవయై వచ్చినది. గావున మావాని కామెపై హక్కు లేదా?"

ఈ మాటలు విని, పెరుస్యుసు పకాపక నవ్వి యిట్లనియె:— "అయ్యా! నీతనయున కొక వధువు కావలసి యున్నచో తా నొక పశుచు ప్రాణమును గాపాడుకొనుమనుము. పరిస్థితులనుబట్టి చూడఁగా, నాతఁడు కోరమాలిన వాఁడుగాఁగనఁబడుచున్నాఁడు. ఈమెను చావుమని వదిలిపెట్టినాఁడు. అతని కామె చచ్చినదిగనే భావింపవలెను. నేనామె ప్రాణములను గాపాడిన వాఁడను. సజీవయగు నామె నాకే చెంది యుండును. మరియెవ్వరికినిఁ జెందదు. కృతఘ్నుఁడా! మీ రాజ్యమును, మీ పుత్రులను, పుత్రికలను ఘోరవిపత్తు నుండి తప్పించి నందుల కిదియా నీవు చేయుసత్కారము. పో. పొమ్ము, లేనిచో చెడిపోయెదవు సుమా!"

ఈమాటలకు ఫినియసు క్రోధచోదితుఁడయి "అయితే, కాచుకో" అని కత్తిదూసెను. ఆతని పరివారమును గత్తులు దూసిరి. అందరు నొక్కుమ్మడి పెరుస్యుసుపై గవయుచుండిరి. రాజును, రాణియు తత్తరపాటు చెందిరి. ఆంద్రోమెడా భయభ్రాంతయయి ప్రియునిప్రక్క నొదిగెను. వారందరకును భయపడవలదని ధైర్యము చెప్పి, పెరుస్యుసు తోలుసంచి గైకొని, పైకెత్తి, తోలు తొలఁగించి, గార్గను తలను వారికిఁ జూపెను. వారంద రొకటి రెండడుగులు ముందునకు వేయఁగనే యట్లే యాగదిలో వారాగిపోయిరి. ఎత్తినచేతు లెత్తినట్లే యుండెను. వారియందు చలనమే లేకపోయెను. అంత వారందరు శిలారూపములు వహించిరి. ఈ దృశ్యమునుజూచి

ఫీనియుసుయొక్క మిగత పరిజనులు పలాయనము చిత్తగించిరి. పెరుస్స్యూసు నాజ్ఞప్రకారము శిలలను జెళ్ళగించి సముద్రమునం బడవైచిరి.

ఒకానొక సుముహూర్తమున పెరుస్స్యూసు ఆండ్రొమెడాలు దంపతులయిరి. పెండ్లివిందులు, వేడుకలు, అత్యంత వైభవముగా జరిగెను. కొన్నినాళ్ళ తరువాత పెరుస్స్యూసు తన నూతన వధువును దీసికొని, తిరిగి తన ప్రయాణము సాగించెను.

౪

పెరుస్స్యూసు తల్లిని వీడి యిప్పటి కేడుసంవత్సరములయ్యెను. అతఁడు మరణించి యుండునని యే యందరు తలంచిరి. పుత్రవియోగమువలన డానయికిఁ గలిగిన దుఃఖమునకు మితియే లేకుండెను. పెరుస్స్యూసుయొక్క యీ దీర్ఘ ప్రవాస కాలములో డానయి జీవితము ప్రశాంతముగనే గడచెను. రాజువలన నెట్టి యిబ్బందులును గలుగలేదు. డిక్టిసు దంపతులు డానయిని సదా కనిపెట్టుచు నామె నోదార్చుచుండిరి.

పెరుస్స్యూసు తన వధువును వెంటఁగొని బయలుదేరి మార్గమధ్యమున మరికొన్ని ఘనకార్యము లొనర్చి సెఫోరసు ద్వీపమునకు వచ్చెను. అతఁడు తన వధూమణితో తల్లికడ

కుం జని వం దేమాతర మని పాదాభివందన మాచరించినప్పుడు ఆ మాతృశ్రీ పరమానంద భరితురాలయి తన దుఃఖముల నన్నిటిని మరచెను.

పెరుస్యూసు సుఖముగా వచ్చినందులకు జనులందరు సంతోషించిరి. పెరుస్యూసుయొక్క వీరవిహార కథనములు వినియు, మానినీతిలకమగు ఆండ్రొమెడా యందచందము లను, సుగుణసంపత్తినిఁ గనియు, పరిపూర్ణ యౌవనశ్శోభా విలసితుఁడయిన యా మహావీరుని తిలకించియు దానయి, డిక్టిసుదంపతులు, పురజనులు హర్ష బాష్పాకులులయిరి. కాని పోలిడిక్టీసు రాజునకు మాత్రము వానిరాక అందు చెక్కు చెదరకుండ వచ్చుట అత్యంత వ్యసనాకరముగఁ బరిణమిం చెను. ఒకనాఁడు పెరుస్యూసు రాజదర్శనము చేసికొనెను. వారిద్ద రిట్లు సంభాషించిరి:—

రాజు— ఏమయ్యా! మెడ్యూసా తలను ఖండించితివా?

పెరు— ఖండించితిని.

రాజు— ఆ శిరస్సు నిచ్చటికిఁ దెచ్చితివా?

పెరు— తెచ్చితిని.

రాజు— మాకుఁ జూపెదవా?

పెరు— చూపను.

రాజు— ఏల?

పెరు— అది మీకు శ్రేయస్కరముగాదు.

రాజు— ఇవన్నియు వట్టిసాకులు. మేము నీమాటలు నమ్మము!

పెరు— నే నసత్య మాడుటలేదు.

రాజు— ఓహొహా! గొప్ప సత్యసంధుఁడవు బయలు దేరినావు! నీవు వట్టి ప్రగల్భరాయుఁడ వని మేము భావించు చున్నారము!

పెరు— మీరు నన్నుగూర్చి యెట్లు భావించిన నిబ్బంది లేదు. ఇదిగో ఈ తోలుసంచిలో మెడ్యూసా శిరస్సున్నది. మీకుఁ జూపుటకు జంకుచున్నాను.

రాజు— నీవు చేసిన ఘనకార్యమునకు దృష్టాంతముగ నా శిరస్సును మాకుఁ జూపవలయును. నీవు తుచ్ఛుఁడవు, నీచుఁడ వగుటచే మమ్ము మోసముచేయఁ దలంచు చున్నావు. ఇట్టి వికృత ప్రవర్తనమునకు నిన్ను క్రూరముగ శిక్షించెదము.

పెరు— మీకిట్టి విపరీతపుబుద్ధి పుట్టినందులకు నేను మిగుల వగచుచున్నాను. "వినాశకాలే విపరీతబుద్ధిః" అని యందురు. ఇదిగో! మెడ్యూసా శిరస్సును జూచుటకు సిద్ధముగా నుండుఁడు.

ఇట్లు పలుకుచు పెరస్స్యుసు తోలుసంచిని పైకెత్తి మూఁతను తొలఁగించెను. రాజుదృష్టి యామెడ్యూసా ముఖముపై పడఁగనే పీఠముపైనున్న రాజట్లే శిలగా మారిపోయెను. దురుద్దేశముతో రాజాతనిని దుర్ఘట కార్యసాధ

నకుఁ బంపెను. వాని దురుద్దేశమే వాని నెత్తిఁగొట్టినది. “చెఱపకురా చెడెదవు” అను సూక్తి యీరాజుపట్ల సార్థకమయ్యెను. దుష్టరాజు మరణించినందులకుఁ బ్రజలు సంతోషించిరి. పెరుస్యుసు డిక్టిసునకు పట్టము గట్టెను.

దేవతలు తనకుఁజేసిన సహాయమే తన విజయ పరంపరకుఁ గారణములని పెరుస్యుసునకుఁ దెలియును. అందుచే వారియెడ నెంతయుఁ గృతజ్ఞతాబద్ధుఁ డయ్యెను. ఆ మెడ్యూసా శిరమును మినర్వా దేవికి సమర్పించెను. ఆ కానుక కా దేవత మిగుల ముదమందెను. దాని నామె తన డాలుమధ్యమున నెలకొల్పెను. అప్పటినుండి మినర్వా యే యుద్ధరంగమునందు విహరించుచుండినను ఆమె డాలునందు మెడ్యూసా శిరస్సు మెరయుచుండెను. దానినిఁ జూచిన వారందరు శిలలుగా మారుచుండిరి. శిరస్త్రాణము, ఖడ్గము, పాదుకలు విచిత్రముగా నదృశ్యము లయ్యెను.

ఇట్లు పెరుస్యుసు సెఫోరసు నందలి కార్యజాతమును ముగించుకొని, డిక్టిసుదంపతుల యనుజ్ఞఁబడసి, పురజనుల వీడ్కోలు నందుకొని, తనతల్లిని, భార్యను వెంటఁబెట్టుకొని, తన మాతామహస్థానమగు ఆర్గోసునకు బయలుదేరెను. అతడు ఆర్గోసునకు చేరినప్పుడు అక్రిసియసును వెడలఁగొట్టి ప్రోటసు రాజ్యమేలుచుండుట తెలిసికొనెను. వారు అక్రిసియసును వెదకుచుఁ బోయి లారిస్సా నగరములో నక్రిసియసును జూచిరి.

పెరుస్యూసు లారిస్సాకు వెడలినప్పు డచ్చట గొప్ప మహోత్సవములు జరుగుచుండెను. రాజు ప్రక్కనే ఆక్రిసియసు కూర్చుండి యుండెను. మల్ల విద్యాది ప్రదర్శనములు జరుగుచుండెను. పెరుస్యూసుకూడ నా పోటీలలోఁ బాల్గొనసాగెను. వాని నెవరెరుంగరు. ఆక్రిసియసు గుర్తించలేదు. ధనుర్విద్యా పాటవము చూపుచుండగా పెరుస్యూసు విడిచిన బాణము గాలితాకుడున వంకరగాఁ దిరిగి యాక్రిసియసుకుఁ దగిలెను. వాఁడు వెంటనే మరణించెను. దైవవిధి యట్టులే యుండెను గదా!

పెరుస్యూసు లారిస్సానుండి యార్గోసునువచ్చి యచ్చట రాజ్యము చేయుచున్న ప్రోటసును పరాజితునిఁ జేసెను. వానికి సహాయముగా నున్న సైక్లోపుల మదమణంచెను. ఇట్లు మాతామహుని రాజ్యమును వశము చేసికొనెను. కాని మాతామహుని మరణమునకుఁ దాను కారకుఁడగుటచే నచ్చట నుండనొల్లక తన రాజ్యమును మరియొకని రాజ్యముతో వినిమయము చేసికొనెను. అచ్చట మిసీనీ యను క్రొత్త పట్టణమును నిర్మించి తన రాజధానిగఁ జేసికొనెను. పెరుస్యూసు చిరకాలము ప్రజారంజకముగా రాజ్యము చేసెను. ఇతనికి ఆంద్రోమెడా వలన నలుగురు కొడుకులు, ముగ్గురు కుమారికలు జనించిరి. సత్పరిపాలనా దక్షుఁడయిన కుమారుని, వరవర్ణినియగు కోడలిని, ముద్దుమురిపెము లొలికించుచుండెడు మనుమలను, మనుమరాండ్రను జూచుకొని

సంతోష సాగరమునం దోలలాడుచు, వీరమాతయయి, రాజ మాతయయి డానయి ధన్యజీవి యయ్యెను.



సీఫియుసు, కాస్సైయోపి, పెరుస్స్యుసు, ఆండ్రోమెడా- వీరు నలుగురు మరణించిన తరువాత మినర్వాదేవి వీరిని నాకాశమున నక్షత్రరూపమున వెలయించెను. నక్షత్ర ప్రకాశ మగు రాత్రులందు వీరు ప్రకాశించుచుండుట మన మిప్పటి కిని జూడవచ్చును. సీఫియుసు రాజమకుటముతో నుండును. కాస్సైయోపి యొక దంతపు కుర్చీపైఁ గూర్చుండి తన శిరోజ ములను జడయల్లుచుండును. పెరుస్స్యుసు గార్గను శిరస్సును బట్టుకొని యుండును. ఆండ్రోమెడా మహానాగమున కెరగా రాతికిఁ గట్టఁబడియుండిన నాటివిధముగా కరకమలములను జాచుకొని యుండును. వీరు రాత్రియంతయు నిట్లు ప్రకాశిం చుచుఁ బగలు ఒలింపసు పర్వతముమీఁది దేవతలతో విహారగించు చుందురఁట!

## వి వ ర ణ ము

1. జ్యూపిటరు- రోమనుల దేవేశ్వరుఁడు. శాటరను కుమా రుఁడు. జ్యూనోమగఁడు. గ్రీకుల జ్యూయసు. (ద్యాఃపితరః)
2. మెర్క్యురి- జ్యూపిటరు కుమారుఁడు. తల్లి మైయా. రోమ నుల వాణిజ్యమున కధిష్ఠానదేవత. దేవతల సందేశహారి. గ్రీకుల హెర్మీజు.

3. ప్లూటో— రోమనుల పాతాళలోకాధిపతి. మరణించిన వారందరీకని లోకమునకుఁ బోయెదరు. జ్యూపిటరునకు, నెప్ట్యూనుకు సోదరుఁడు. గ్రీకుల హేడ్సు(యమధర్మరాజు)

4. నెప్ట్యూను— సముద్రాధిదేవత. జ్యూపిటరునకు, ప్లూటోకు సోదరుఁడు, గ్రీకుల పోసైడను. (వరుణుఁడు)

5. మినర్వా— రోమనుల విద్యావివేక శీలాధిదేవత. జ్యూపిటరు కొమరిత. బ్రహ్మచారిణి; యోధురాలు. గ్రీకుల అథీనా. (సరస్వతి)

6. ఒలింపసు— ఒక పర్వతము. జ్యూపిటరు మొదలగు దేవతలుండు స్వర్గము.

7. సీఫియుసు— వృషపర్వ నక్షత్రము.

8. కాసైయోపి— శర్మిష్ఠా నక్షత్రము.

9. పెరుస్యూసు— యయాతి నక్షత్రము.

10. ఆండ్రొమెడా— దేవయాని నక్షత్రము. (ఉత్తరాభాద్ర నక్షత్రము)

11. హాల్సియోను దినములు— హాల్సియోను అను రాణి భర్త సముద్రముపై ప్రయాణము చేయుచుండఁగా, నావపగిలి వాఁడు జలమరణము నొందెను హాల్సియోను కాసంగతి తెలియక పతిరాక ఆలస్యమయినందులకు వగచుచుండెను. నిజమామెకు తెలుపవలసినదిగా దేవతలు నిద్రాదేవత నాజ్ఞాపించిరి. నిద్రాదేవత ఆమె భర్త రూపముతో ఆమె స్వప్నములో కనఁబడి తన మరణ

విషయము తెలిపెను. ఆమె దిగ్గన మేల్కాని యుదయ మున సముద్రముదరికి పోగా అచ్చట నామెకు భర్త శవము కనబడెను. హానాథా! అని యామె సముద్రము నందు దూకెను. దేవతలు కరుణించి వారి నిద్దరను హాల్సియోను పక్షులుగా మార్చిరి. ఎట్టి కల్లోల సము ద్రమునం దయినను, సంవత్సరమునం దేడుదినములు ప్రశాంతముగా నుండును. ఇట్టి నిశ్చలజలములమీద హాల్సియోను పక్షులు తేలుచున్నట్లు కనఁబడును. ఆ యేడు దినములకు హాల్సియోను దినము లని పేరు వచ్చినది.

12. సైక్లోపులు—నొసటియందు మాత్రమే కన్నుగల భయం కర రాక్షసులు.



# శ్రావణి

శ్రావణి చక్కనిచుక్క. నవయౌవన వయస్కురాలు. పూనా మహిళా విశ్వవిద్యాలయమునందు జి. ఏ. పట్టమును బొందిన విద్యావతి. చక్కదనమునకుఁ దగిన సాహిత్యము, సాహిత్యమునకుఁ దగిన దేశాభిమానము ఆమెయందుఁ బొంగి పొరలుచుండెను.

ఆమె యొకనాడు తన ఆఫీసుగదిలో బల్లవద్దఁ గూర్చుండి, పేరుప్రతిష్ఠలు లేకపోయినను, మిక్కిలి రమ్యమైన "దరిద్రనారాయణ" పత్రిక సంపాదకీయ కార్యమును నెరవేర్చుచుండెను.

పత్రిక ఎంత కొద్దిపాటిదో, సంపాదకుల గదియు నంతమాత్రపుదే. హృదయమందే మాత్రము కరుణాలేశము కలవారయినను, ఆ గదియొక్క నాలుగుగోడల మధ్య పిల్లికూననైనను ఉయ్యాలలో నూపుటకు ప్రయత్నింపరు. ఈ గోడల నిండను దేశపటములు, లెక్కల మిసళ్లు, పుస్తకములుపెట్టు చిన్న తుక్కు అల్మారా, జపాన్ దేశపు పాతగడియారము తగిలింపఁబడి యున్నవి. వీనిమధ్య పెక్కు మరకలుగల గోడ అసహ్యకరముగాఁ గనఁబడుచున్నది. వ్రాతబల్ల పాతది; సీలలు ఊడినది. అసలీబల్ల ప్రపంచములోనికి వచ్చినప్పుడే మిక్కిలి చౌకదయి యుండును. పైగా కాలముకూడ దానిపై

దండయాత్ర చేసినది. సంపాదకుల కుర్చీమీదనుగూడ కాలము తన ప్రభావమును గనఁబరచి యున్నది. ఆ కుర్చీ వెనుక భాగమునకును బీఠమునకును సంబంధము అసంగత ముగా నుండుటచే, సంపాదకురాలు, వీపు ఎంత లాగు చున్నను, వెనుకకు వ్రాలుటకు సాహసింపఁ జాలదు.

ఆఫీసుగది కానుకొని ప్రక్కనున్న కొట్టములోనుండి క్లంగ్, క్లంగ్, అనుచు తుక్కుముద్రా యంత్రముల ధ్వని వినవచ్చుచుండెను. అవి యీ సమయమున మిగుల కష్ట ముతో ఒకచిన్న ప్రకటనను ముద్రించుచుండెను.

ఈ కొట్టములోనుండి చిఱ్ఱవెండ్రుకలు, పాలిపోయిన మొగముగల బాలుఁడొకడు, ఒక గంటక్రింద సంపాదకురాలు వ్రాసిన ప్రధానవ్యాసము యొక్క సవరించిన ప్రూపును బట్టుకొని వచ్చెను.

"అమ్మా! ఇదిగోనండి. మీరు వ్రాసిన వ్యాసము. మేము దీనికొఱకు పని నాపియుంచినాము" అని వాఁడనెను.

సంపాదకురాలు ఆతడి కాగితమును గైకొని వ్యాపార సరణి ధ్యానమును సూచించు వైఖరితోఁ గొద్దిగా తల నాడించెను. అది యామె మనోజ్ఞమగు వదనముతో నెంత మాత్రము ఏలకో సామరస్యము కలిగియుండలేదు.

కాని "మనోజ్ఞము" అనునది సరియైన పదముకాదు. ఏలయన "మనోజ్ఞత్వ" మున్నచోట బలముండదు. శ్రావణి మొగములో బలమున్నది. ఇంతయేల, విశాలమై, ఆలోచనా శీలమగు నామె నయనములు మిక్కిలి కోమలములు. చల్లనివి. ఆమె పెదవులనుండి వెడలుమాటల మృదుత్వము, నారీజన సహజమగు మాధుర్యము కాంబోలు యంత్రమువద్ద పని చేయు నిద్దఱు మనుష్యులను, ఆబాలుని, పత్రిక పంచువానిని ఆమెను భక్తిశ్రద్ధలతో సేవించునట్లు చేయుచుండెను.

శ్రావణి యూతడి కాగితమును జేతం బట్టుకొనినను దానిని వెంటనే దిద్దుటకుం బ్రారంభింప వలసియున్నను అట్లు చేయలేదు. కాని ఆలోచనా పూరితమగు మనస్సుతో దాని మీదుగాం జూడసాగెను. అట్లు చూచుటలో నామె సుందరమైన కనుబొమ లానేత్రకమలములపై ముడుచుకొనిపోయెను. యంత్రము లిప్పుడు శబ్దించుటలేదు. ఇప్పు డామె గదిలోనికి వేరు ధ్వని ప్రవేశించు చుండెను. అది వీథిలోని బండ్లమొక్క కఱకు చప్పుడు. పురములోని సందడి. ఏలయన రామపురము క్రమాభివృద్ధి నొందుచున్న ప్రదేశము. యంత్రాలయముల నుండి వెడలు పొగ గ్రామమునకు నల్లని పూంత పూయుచున్నది. యంత్రాలయములనుండి వెలువడు ఈలలు వికారముగా మ్రోగుచున్నవి.

ఈ ధ్వనులను శ్రావణి తనకు తెలియకుండనే ఒకటి రెండు నిమిషముల వఱకు విన్నది. తదుపరి ఒక సబ్బూద్పు

విడిచి ప్రాశ్చాత్య [sic] పుస్తకమును బల్లపై నుంచి, దిద్దుటకు నుద్యమించెను. అంతలో ద్వారము నెవరో తట్టిరి "లోపలికి రాండి" అని శ్రావణి పలుకగనే ఒకతరుణి లోనికిఁ బ్రవేశించెను.

ఈ తరుణిని సుందరియన్న నా పదమామె కెంతయుఁ దగియుండును. మనోహర వస్త్రాభరణాలంకృతయగు నా యువతి ఆ నిర్వికారమగు గదికిఁ గళాకాంతులను గలిగించెను. కళ, కాంతి, గానము, కవిత్వము అనువాని యెడల పక్షపాత బుద్ధిగల శ్రావణి తన పరిస్థితికి మిగుల నొచ్చుకొనెను.

"ఓహో! నేను రావచ్చునా? లేక నీవు మిక్కిలి పనిగా నున్నావా? అట్లయితే చెప్పుము. నే నిప్పుడే అంతర్ధాన మయ్యెదను" అని యా యువతి నవ్వుచుఁ బలికెను.

ఆ యువతినిఁ జూచి శ్రావణి సంతోషపూర్వక మందహాసము చేసెను. ఆశ్లేష శ్రావణి సహాధ్యాయిని యయియుండెను. ఇప్పు డిద్దఱు ఒకే గ్రామమం దుండుట తటస్థించినది. రామపురమునందు సంపన్న గృహస్థు అగు లక్ష్మణరావు ఆశ్లేషయొక్క జనకుఁడు. ఆశ్లేష భర్త చక్రధర రావు ఐ. సి. యస్. పరీక్ష కింగ్లాండు వెళ్లి యుండుటచే నామె పుట్టినింటికి వచ్చెను.

"నాకుఁగల పని ఇంతా అంతా అని చెప్పఁజాలను. నాకు చేతులనిండా పనియున్నది. ఏలయన ఇప్పుడే మాపత్రిక సంచిక వెలువడ నున్నది. అయినను నీకు అయిదు నిమిష ములు ఇచ్చెదను. వచ్చి యీ కుర్చీమీఁద గూర్చుండుము. తర్కము ప్రారంభించి కాలము వ్యర్థపుచ్చకుము. అట్టి దాని కవకాశమే లేదు. అయిదు నిమిషముల కాలము సంతోష ముతోఁ గాళ్ళు చాచుకొనెదను. నీకు నేను చూపఁగలుగు మర్యాద అంతియే." అని శ్రావణి యనెను.

తన స్నేహితురాలగు శ్రావణితో తర్కవాదము చేయవలయునను తలంపు ఆశ్లేష కెన్నటికిని లేదు. కాఁబట్టి ఆ యూఁపుబాడు కుర్చీమీఁదఁ గూర్చుండి, గది నలుప్రక్కల బెదురుచూపులతోఁ బరికించెను. ఏలయన, ఆమె చుట్టును, కావలసినంత సిరా, మసి ఉండెను.

"నేను బజారునకుఁ గొంచెము పనియుండి వచ్చితిని. ఇంతదనుక వచ్చి, నీ పని యెట్లు సాగుచున్నదో చూచి తీర వలయునని తలంచినాను. నీవీ గ్రామమునకు వచ్చి మూడు వారములయిన దనియు మావద్ది కింతవఱకు రాలేదనియు నీకు దెలియునా? ఎంత విశ్వాసము లేని దానివే?" అని ఆశ్లేష యనెను.

"నాకదంతయుఁ దెలియును. నాకు ఊపిరాడకుండ పని యున్నది. ఒక్క నిమిషమయిన నాకు విరామము గనఁ బడుటలేదు." అని శ్రావణి పలికెను.

"నీ వెట్టి కార్యమును నిర్వహించుచున్నావో చూడ వలయు నని నా కెంత యుబలాటముగలదో నాన్నగారికిని అంత యుబలాటము గలదు. ఆయన నా వెంట రావలయునని తలంచెను గాని నేనే యెంతో కష్టముమీఁద ఆపినాను. "దరిద్రనారాయణ" పత్రికను మూఁడు వారములు నిర్వహించిన సంపాదకురాలగు యువతి ఎట్లుండునో చూడవలయు నని ఆయన కపేక్ష. ముద్రాయంత్రపు సిరాబొట్లతో నీ ముఖ మలంకృతమై యుండుననియు, నీవు చెవిసందునఁ గట్టె కలము నిఱికించుకొని యుందువనియు ఆయన భావించు చున్నాఁడు. ఆయన జీవితకాలములో ఇంతకన్న వినోద విషయము ఆయనకుఁ గనఁబడలేదఁట! ఈ నీ పత్రికా కార్యము తన జీవితమును దీర్ఘముగను, ప్రకాశవంతముగను జేసిన దఁట! అందుచే నీ కెంతయుఁ గృతజ్ఞుడఁట! నాన్నగా రొక్కొక సారి ఎంత హాస్యముగా ముచ్చట లాడుదురో నీకు తెలి యును గదా." అని ఆశ్లేష అనెను.

"అవునవును. నాకు తెలియును, ఈ పత్రికయొక్క 'హాస్యలత' భాగమునకు వ్రాయవలసినదిగా ఆయనను కోర వలెనని కూడ నాకు స్ఫురించినది. అయితే ఈ "దరిద్రనారా యణ" పని యంతయు ఆయనకు హాస్యముగానే కనుపించు చున్నదేమో! కాని నాకుమాత్ర మిది మిక్కిలి పవిత్ర కార్యము. ఆశ్లేషా, నే నీ పత్రికను ఎందుకు కొన్నానో, ఏల స్వయముగా నడపుటకు నిశ్చయించు కొన్నానో నీకుఁ దెలియును గదా!"

“చెలీ! నేనెఱుఁగుదును. నీ వీ రామపుర ప్రజలకు కొంత యుపకారము చేయవలయునని తలంచినావు.”

“అవును, అదియే నాపిచ్చి యుద్దేశము. ఆ పిచ్చి తనముయొక్క పరిపూర్ణతను నే నిప్పుడిప్పుడే గ్రహించు చున్నాను. ఈపని యిప్పుడిప్పుడే నాధైర్యమును సడలించుటకు ప్రారంభము చేయుచున్నది. నా కిప్పుడు కష్టముగాఁ గనఁ బడుచున్నది పత్రికా నిర్వహణమున నా యశక్తత యెంత మాత్రమును గాదు; నన్ను కుంగఁజేయుచున్న భారము ఈ దుష్టనగరము యొక్క పరిస్థితులు. దుష్టమను పదము వాడినందులకు నన్ను క్షమించుము. ఆ పదము సంపాదకులకు మిక్కిలి యిష్టమైనదని యనుకొనెదను. పత్రికను గూర్చిన పని లేనప్పుడు, నగరవీధులగుండ, నితాంత క్రోధమును దిగ మ్రింగుచు, సంచరించు చుందును. దాని క్షుద్రత్వము—అది యంత చెడ్డపదము గాదు— దాని, యశుభ్రత్వము, ఫ్యాక్టరీ లలో నీళ్ళప్రాయముగఁ తమ జీవితములను వ్యర్థముచేయు దీనజనుల దారిద్ర్యము, నిరాశ నా మనస్సును నరముల మీఁది పుండులవలె బాధించుచున్నవి.

“ఓసీ! శ్రావణీ! ఎంత భయంకరమయిన భాష!”

“ఇంకను వినుము. ఎకరముల కొలఁది ఖాళీస్థలము చుట్టు కొని యుండగా, తమ గొప్ప భవనములలో సుఖసుప్తులగు జమీందారుల స్థితికిని, గాలి నీరు రాని ముఱికిగదులలోఁ గిక్కిరిసియున్న దౌర్భాగ్యుల స్థితికినిఁ దారతమ్యమును

జూచినప్పుడు నాకు మరింత వేదనాకరముగా నున్నది. భాగ్యవంతుల స్వార్థపరత్వము ఎల్లప్పుడును జుగుప్సాకరము. దానిని నే నెంతమాత్రమును సహింపఁజాల కున్నాను. ఉదాహరణముగా రాజా రామభూషణరావు బహద్దరుగారి విషయము తీసికొనుము. ఆయన అష్టైశ్వర్యములతోఁ దుల దూఁగుచున్నాఁడు. ఆయనకు ఆ ప్రచండ హార్మ్యమునకుఁ దోడుగ, ఒక నగరోద్యానముగూడఁ గలదు. నగరోద్యానము, విన్నావా ? అది సరాసరి నగరమధ్యమునకు వ్యాపించి యున్నది. ఉన్నతమైన కుడ్యములతో, సదా బంధితమైన ద్వారముతో నది యొప్పారుచున్నది. కూలి నాలి చేసికొని బ్రతికెడు స్త్రీలు, శిశువులు పోవునప్పుడు, వచ్చునప్పుడు పక్కవాట రంధ్రములనుండియు, ఆ కటకటాల మధ్యనుండియు, వాంఛాపూర్వకములతో వీక్షించు చుండఁగా నేను చూచియున్నాను. అప్పుడు నారక్తము సలసల క్రాగి, ఆ నగరప్రజలను చేరఁగొట్టి, వారితో దానిపైఁబడి విధ్వంసము చేయవలయు నన్నంత క్రోధము నాకు జనించినది. ఆ నగరోద్యానమును ఆయన యెప్పుడును వాడఁడు. వనపాలకులు తప్ప మరెవ్వరును అందెన్నఁడును గనఁబడి యుండ లేదు. రామపురపు అశేషప్రజకు నది సంతోషమును, సౌఖ్యమును విశ్రాంతిని ఇయ్యఁగలదు, కాని, అబ్బే! అట్లెన్నటికినిఁ గాఁగూడదు. మా రాజా రామభూషణరావు బహద్దరువారి కొఱకే పరమేశ్వరుఁడు దానిని సృష్టించినట్లు, చక్కఁగ

మూసియుంచి, జాగ్రత్తగఁ గావలి పెట్టవలయును. ఇది యెంతయు లజ్జాకరము. రాజావారితో నాలాగె చెప్పినాను.

ఆశ్లేష తన సుందర విలోచనములను విప్పారునట్లు చూచెను.

"ఆలాగే చెప్పినావు? అదెట్లు? మొన్ననే గదా ఆయన ఇచ్చటికి వచ్చినది! అప్పుడే యాయనను జూచినావా?"

శ్రావణి తల యడ్డముగఁ ద్రిప్పెను.

"లేదు. నేను చూడలేదు. నేను జూడఁ దలఁచుకొనలేదు. నే నాలాగు అచ్చులోఁ జెప్పినాను. ఇప్పుడే సంపాదకీయ వ్యాసమును వ్రాసినాను. నీవు వచ్చినప్పుడు, దీని నింకను జులుకుగాఁ జేయవచ్చునా యని యోచించుచుంటిని. వినుము."

అని, శ్రావణి ఆ ప్రూఫుకాగితమును దీసికొని, అచ్చటచ్చట నొత్తియొత్తి పలుకుచు, భావద్యోతకముగ నా సంపాదకీయ వ్యాసమును ఆ మూలాగ్రముగఁ బఠించెను.

ఆశ్లేష కన్నులు కంచము లంత యయ్యెను.

"అమ్మయ్యో! శ్రావణీ? దీనినిఁ బ్రకటింపఁ దలఁచుకొన్నావని నేననుకొనను." అని యామె తన యాశ్చర్యమును వెల్లడించెను.

" ఏం? ఎందుచేతఁ బ్రికటింపఁ గూడదు? అంత చులు కుగా లేదా?

" చురుకుగా లేదా? నాజీవితములో నెన్నఁడు ఇంత దారుణమైనది వినలేదు. ఇంతయేల. ఇది నిజముగా మానసష్టకర మయినది. శ్రావణీ! నీ వాయననుః దొంగ యన్నంత విధముగాఁ బలికినావు. మరియు—"

" అవును. అతఁ డట్టివాఁడే. ప్రజల సొత్తగు శుద్ధ వాయువును ఆతఁడు దొంగిలించు చున్నాఁడు."

"కఠోర హృదయుఁడగు భోగలాలసుఁడా? "

" అతఁ డట్టివాఁడే. హాయిగఁ గూర్చుండుచు, లేదా ఆరామములందును, అంతఃపురము లందును, పూసెజ్జలం దూలుచు, నిఃప్రయోజనముగ నుద్యానవనమును బంధించి యుంచు మానవుని హృదయము కఠోరమైనదిగాక మరెట్టిది? ఇది అంత గొప్ప విశేషణము కాదు."

"దగాకోరు ధర్మకర్తయా."

"సరిగా నంతే. మానవున కైశ్వర్య మిచ్చినది స్వయం తృప్తి కొఱకనియేనా నీ అభిప్రాయముః అట్లెంతమాత్రి మును గాదు. దీనులగు తన సోదరమానవుల పక్షమున ధర్మ కర్తగా వ్యవహరించుట కది యియ్యఁబడినది. అట్టి భాగ్య మును స్వప్రయోజనము కొఱకు వినియోగించుకొని,

విశ్వాసభంగ దోషమునకు గురిమైనచో, అతడు దగాకోరే. అలాగే రాజా రామభూషణరావు బహద్దురువారికి తేట తెలుంగులో వివరించి యున్నాను. దానిని బహుశకూడ అర్థము చేసికొనఁ గలుగుదని నేను నమ్ముచున్నాను.''

''అయితే యీయన దాని నెన్నఁడయినను జూచునా యని నా సంశయము. శారీవణీ! నీయెడ నాకెంతో గౌరవ మున్నను నీ ''పరివ్రీనారాయణ''ను చదువఁబట్టివాఁడు రాజా రామభూషణరావు బహద్దురువారు కారనుమా.''

''ఆతఁ డిది చదువునని నా నమ్మిక. సంపాదకీయ వ్యాసము చుట్టుచు ఎఱ్ఱసిరాతో ఒత్తుగా గీతగీసి ఒక సంచి కను బంపఁబోవుచున్నాను. అది యెట్టిపని చేయఁగలుగునో చూతము. నీ కప్పుడే ఏఁబనిమిషములవర యిచ్చియున్నాను. చెలీ! ఆశ్లేష! నిన్నిప్పుడు నిజముగాఁ దరిమి వేయవలసి యున్నది.'' అని శారీవణి మృదుస్వనముతోఁ బలికెను.

''సరే! వెళ్లెదను. కాని ఒక్క షరతుమీద. అదియే మనఁగా నీవు వచ్చి, మావద్ద నుండెదనని వాగ్దానము చేయ వలయును. నీమొగ మప్పుడే పాలిపోయినది. నీ వప్పుడే బడ లిక చెందియున్నట్లు గనఁబడుచున్నావు. ఈ విధముగానే కార్యజాతము నడచునట్లు చేయుట ఎంతమాత్రము భావ్యము కాదు. నాకు వ్యతిరేక ప్రత్యుత్తర మిచ్చిన లాభములేదు. వ్యతిరేక ప్రత్యుత్తరము నంగీకరింప వలదని నాన్నగారి

యున్నది. నాన్నగారు నీయందెంత ప్రేమగలవాఁడో నీకు తెలిసిన విషయమే గదా? నీ వెంత పట్టుగలదానవో ఆయన అంత పట్టుదల గలవాఁడు. నేనో చెలీ మీకు విరుద్ధమగు నైజముగల దుర్బలురాలను.”

“మంచిది. వచ్చెడి వారములో నేను వచ్చెదను. అప్పటికి నా వ్యవహారము చాలవఱకు చక్కఁబడగలదు. అవసరమయినచో అప్పుడప్పుడు ఇచ్చటికి వచ్చి, సవరించు కొనఁగలను. ఆ వ్యాసముచూచి నవ్వవద్దని మీ నాన్న గారితోఁ జెప్పుము. లేకపోయినచో, నేనాయనను ఎన్నటి కిని క్షమించను.”

౨

రాజా రామభూషణరావు బహద్దరువారికి ‘దరిద్రనారా యణ’పత్రికయొక్క ఆవారపు సంచిక యుక్తకాలమునందుఁ జేరెను. శ్రీరాజావారు ప్రాతఃకాలమున ఉపహారమును గైకొనుచుండు తరి ఇతర కాగితములు, ఉత్తరములతోఁ బాటు నదియువచ్చెను. బహుశః ఆయన దానిని విప్పిచూడ కుండ నుండియే యుండును. ఏలయన ఆయన యలసుఁడు. అశ్రద్ధగల యువకుఁడు. పఠనాది కార్యములయందు అంతగా మోజులేనివాఁడు. కాని పైకాగితము మీఁద ఎఱ్ఱసిరాలో

'ప్రధానవ్యాసమును జూడుఁడు' అని వ్రాసియుండెను. అందుచే కొంత వింతతోఁ బత్రికను విప్పి అత్యంత శీర్షమైనట్టి, పేరు చెప్పి దూషించినట్టి విమర్శనము అను వర్ణనకు తగినదగు నా వ్యాసమును జదివెను. అతఁడు అలక్ష్యము, అసూయ కలవాఁడే కాక సౌజన్యుఁడు కాఁడను. నుత్తెపెట్టు దెబ్బగా నుద్దేశింపఁబడిన ఆ వ్యాసము వాతఁడు చదివినప్పుడు, అతని వినోద సూచకమగు ముఖవిలాసము, ఆతని పరిహాస సూచకమగు నవ్వు, శ్రావణి కని, విని యుండినచో, ఆమె యత్యంత యాగ్రహ పరవశురాలై యుండి యుండును.

అయితే ప్రధాన వ్యాసమును రెండవసారి చదివి నప్పుడు ఆతఁడు కొంచెము కోపావిష్టుఁ డయ్యెను. అంత ఆలోచనా మగ్నుఁడయ్యెను. మానవుఁ డెంత సౌజన్యుఁడయి యున్నను, తనుఁ గూర్చి, దొంగ, కఠోర హృదయుఁడగు భోగలాలసుఁడు, దగాకోరు ధర్మకర్త అని వర్ణించుటకు ఎంతమాత్రమును ఇష్టపడఁడు. అందుచే నచ్చట చప్పుడు చేయకుండ వేచియున్న సేవకునిఁ బిలిచి యిట్లనెను:—

"జగ్గుపంతులుగారు వచ్చినారేమో చూడు. వచ్చినచో నేను వారినిఁ జూడ దలచుకొన్నానని చెప్పుము"

రాజావారి మంత్రియగు జగ్గుపంతులు గదిలోనికి వచ్చెను. రాజా రామభూషణరావు నమస్కారము చేసి "దరిద్రనారాయణ"ను అతని నైపునకు నెట్టి, దానినిఁ జదవండి. ఎంతో చల్లగా నున్నది కదూ." అని అనెను.

జగ్గుపంతులు చదివెను. రాజావారి కున్నంత సుస్వభావము లేనివాఁడగుటచే నతఁడు కోపముతోఁ జూడసాగెను.

"ఏమి దార్ష్ట్యము? నా జీవితములో నే నెన్నఁడు ఇట్టిది చదివియుండలేదు. రాజావారు ఏమిచేయవలయు నను కొనుచున్నారు? ఇది తప్పక అపకీర్తికరమైనది" అని జగ్గపంతులు పలికెను.

"ఆలాగా! అది యట్టిదే అనుకొనెదను. చేయవలయును? అయితే చేయున దేమున్నది?"

"తమరు పరువునష్టపు దావా తేవచ్చును." అని జగ్గపంతులు పలికెను.

రాజావారు ఎగాదిగఁ జూచి నవ్వెను. "అంత దూర మెందుకు? ఇది నా కెంతమాత్రమును నొప్పి కలిగించుట లేదు." అనెను. తరువాత మెల్లగా నిట్లనెను. "వాడు చెప్పెడు దానిలోఁ గొంత యర్థమున్నది. ఉద్యానవనము నగర మధ్యభాగమున నున్నదికదా? నే నిచ్చటికివచ్చి చాల కాలమయినది. నగరము చాల యభివృద్ధి చెంది, జనసమ్మర్దము కలిగియున్న దనుకొనెదను." ఒకటి రెండు నిమిషములు మౌనము వహించి తిరిగి యిట్లు పలుకసాగెను. "అవును, వాఁడు చెప్పుదానిలో కొంత యర్థమున్నది.

ఆ నగరోద్యానమును జనులు వాడుకొనులాగు ఎందుకుఁ జేయున గూడదండి పంతులుగారూ!"

ప్రశ్నపరంపర గావించుచున్న వ్యాసము మీఁదుగా విస్మయాశ్చర్యములతో జగన్నాథపంతులు చూచి,

"అట్లా? అది చాల ముసాధ్యముండి. దేవరవారికిఁ గల భూములలో నిదియే మిక్కిలి విలువగలది. ఇప్పుడు క్రొత్తగాఁ గట్టఁబోవుచున్న భవనమునకు దాని ప్రతిఅంగుళ భాగమును గావలసియున్నది. దేవరవారు సెలవిచ్చిన రీతిగా నగర మత్యంతవేగముగా వృద్ధిచెందుట చేత—, జగన్నాథపంతులు వాక్యము ముగియకముందే రాజావా రందుకొని,

"అయితే అది యిప్పుడు కొంత కాలమువరకు అవసరములేదు గదా! మన కవసరమగు వంతవరకు దానిని ఏల తెరచి యుంచకూడదు" అని అనెను.

"అట్లెన్నటికినిఁ జేయకూడదు. దేవరవారు కొంచె మాలోచించిన యెడల, అట్టి కార్యము అనర్థదాయకమని గ్రహింపఁగలరు, ప్రజలీయుద్యానవనము తమదిగనే భావింపఁ గలరు. దానినిఁ దిడుగ మూసివేసి భవన నిర్మాణమున కుపయోగించి నప్పుడు, ఇప్పటికంటె నెక్కువగ నతృప్తిఁ జెందఁగలరు. అంతియె గాక, నేను తమతో గతరాత్రి మనవిచేసిన రీతిగా, స్వర్గీయ రాజావారి పరిపాలనవలన తగిలిన దెబ్బనుండి బాగుపడ నలయుననిన, సంస్థాన వ్యవహార

ములను మిగుల మెలఁకువతో నడిపి పరిపాలించవలసి యున్నది. నగరములోని ఉద్యానవనమును వదలుకొనుట కంటె మించిన పిచ్చికార్యము మరియొకటి యుండదు.'' అని జగ్గపంతులు వివరించెను.

రాజా రామభూషణరావు బహద్దరు పడుచువాఁడు. కొద్దికాలము క్రిందటనే సంస్థాన వ్యవహార నిర్వాహణభారము ఆయనపైఁ బడెను. మంత్రితో వాదించుటకు అంత యనుభవము కలవాఁడు కాఁడు. ఇఁక నాతని యభిప్రాయమును ఖండించుట కవకాశ మెక్కడ? కావున నాతడు ''రామపుర కదళి'' యని ప్రసిద్ధిచెందిన యరటిపండొకటి భక్షించుచు, మంత్రిమాటల కయిష్టసూచకముగ బుజముల నెగుర్వైచెను.

''చిత్తము. అయితే ఇప్పు డీ యపఖ్యాతికరమైన వ్యాసమును గూర్చి ఏమి చేయవలయునని తమసెలవు?''

''దానిని నిర్లక్ష్యముచేసి యూరకుండండి''అని రాజా వారు పలికిరి.

''అప్పుడు వాఁడు తిరిగి మీపై దండయాత్ర.సాగింపఁ గలఁడు. ఈ వార్తాపత్రికల వారలకు ఎల్లప్పుడు ఇదే నైజము''

''పోనిమ్ము, అది నన్నెంతమాత్రము బాధింపదు. వానికిని, ఆపత్రికా పాఠకులకును గొంత వినోదముగా నుండఁ

గలదు. రాజాగారూ వ్రాసికే విసుగు వేయుఁగలదు. ఆయన— సంపాదకుఁడో, పత్రికాధిపతో— ఎవఁడు? వీఁడు వాని నెరుగుదురా?" అని రాజావా రడిగిరి.

"నాకు తెలియదండి. ఆ పత్రిక యాజమాన్యము ఈ మధ్య మారినట్లు విన్నాను. విచారించి కనుగొనెదను." అని జగ్గుపంతులు పలికెను.

"వద్దండి. నామాట వినండి. ఆ విషయము జోలికిఁ బోకండి— మరియొకమాట. ప్రతివారము నాకొక పత్రిక వచ్చునట్లు చూడండి. అప్పేర్పాటు చేసెదరా? చందా దారుగాఁ జేర్చుకొమ్మని నాపేరు పంపుట మంచిది. ఈ వ్యాసము వ్రాసినపద్ధతి నాకు నచ్చినది. ఇది కొంచెము చుఱుకుగా నున్నది కదూ!' అని యా యువకుఁ డనెను.

జగ్గుపంతులకు జవాబు చెప్పలేనంత కోపము వచ్చెను. వెంటనే గదినుండి వెడలిపోయెను. కాని రాజాగారినిఁ జందాదారుగాఁ జేర్చుకొమ్మని ఆయనకు వ్రాయక తప్పినది కాదు. సుస్వభావుఁడగు నా పడుచు నృపతికి రెండవవారమున మునుపటి దానికంటెఁ దీవ్రతరమగు విమర్శనముగల రెండవ వ్యాసము చదువు భాగ్యము కలిగెను. మొదటి వ్యాసము కంటె నీ రెండవ వ్యాసము చక్కఁగ రచియింపఁబడినది. దాని శైలిమాధుర్యమునకును, అందలి పలువిధ విశేషణముల సంపత్తునకును రాజావారు అత్యంత ముదిత స్వాంతు లయిరి.

వ్యాసమును బూర్తిగఁ జదివి "ఇది నిక్కముగ గుండు దెబ్బ వ్యాసము. ఈ ప్రాంతభవనముల నన్నిటినిఁ బడఁగొట్టి అచ్చట పరిశ్రమాలయములను గట్టవలెనఁట! ఉద్యానవనమును బ్రజల యుపయోగమునకు విడచివేయ వలయునఁట! ఇఁక ముందువారము రాజప్రాసాదమును దీర్ఘరోగులకు వైద్యాలయముగను, పచ్చికబయళ్ళను ఫాక్టరి కూలివారలకు అనుకూలమగు తోఁటలుగను మార్చవలయునని ఆయన నిర్బంధించును గాఁబోలు" అని రాజా తనలో తానను కొనెను.

రాజా రామభూషణరావు బహద్దరువారి సౌజన్యము ప్రశంసనీయమయిన దనుటకు సందియము లేదు. కాని యది "దరిద్రనారాయణ'' సంపాదకురాలికి అత్యాగ్రహ సంజనితముగాఁ గనఁబడెను.

### 3

లక్ష్మణరావు, ఆశ్లేష, శ్రావణి, ముగ్గురును లక్ష్మణ రావుగారి గృహమగు ''లక్ష్మీరంగము" నందు ఇంటిముందటి వసారాలోఁ గూరుచుండి మాటాడుచుండిరి.

''రాజా రామభూషణరావు వెంటనే దావా తీసికొని రాకపోయినను, న్యాయవాదిచే నోటీసయినా యిప్పించునని తలంచి యుంటిని, మొదటివ్యాసము ఎట్లుండినను, ఈవారము వ్యాసము తప్పక పరువునష్టము తెచ్చునదే. అది యట్లుండ వలయుననియే వ్రాసినాను. రాజామూర్ఖ యువకుఁడయి యుండును" అని శ్రావణి అనెను.''

లక్ష్మణరావు లోలోన నవ్వుకొనెను.

"కుమారీ! సుప్రసిద్ధ 'దక్షిణనారాయణ' పత్రికవ్రాత లను ఇట్లు నిర్లక్ష్యము చేయుట కొంత కష్టముగానే యున్న దని నేనొప్పుకొను చున్నను, రాజా రామభూషణరావు యోగ్యుఁడగు పడుచువాఁడు సుమా! నీ వాయనను జూచిన యెడల, ఆయన విషయము తెలిసికొన్న యెడల, ఆయనను ద్వేషించవు సుమా" అని లక్ష్మణరావు అనెను.

"నే నాయనను ద్వేషించుటలేదు. ఆయనను జూడ వలయునని అపేక్షించుటయును లేదు." అని శారదని యుత్తర మిచ్చెను.

"ఎంత విచారకరము? ఏలయన అదుగో ఆ మార్గ మున గుఱ్ఱముమీఁద వాఁడు వచ్చుచున్నాఁడు. బహుశః ఇచ్చటికే వచ్చుచుండ వచ్చును." అని ఆక్షేప వచించెను.

మరికొంత వినోదమునకు అవకాశము కలిగినది కదా యని లక్ష్మణరావు లోలోన నవ్వసాగెను.

"ఏమే, నీ వెవ్వరో ఆయనకుఁ దెలుపుదునా?" అని అతఁ డడిగెను.

"శ్రావణి మొగము తెల్లబోయెను. 'చెప్పండి. దాని కేమి' అని యనెను. నే జెప్పెద ననుకొనను. మా యింటి ముంగట రక్తపాతము నా కిష్టములేదు; అవునే శారదణీ!

'దరిద్రనారాయణ' పత్రికను గూర్చి మనమేమియు ముచ్చటించఁ గూడదు సుమా'' అని లక్ష్మణరావు అనెను.

శ్రావణి యాతని యభిప్రాయమునకుఁ దన యసమ్మతినిఁ జెప్పి వాదించుట కవకాశము దొరుకకముందే రాజావారు గృహప్రాంగణము లోనికి రానేవచ్చిరి. రాజా రామభూషణరావు నవయౌవన శోభితుఁడగు సుందర పురుషుఁడుగాఁ గనఁబడు చుండెను. శ్రావణి యాతనినిఁ జూడఁగనె తనకెంతో యాశాభంగము గలిగినట్లు భావించెను. ఇంతకంటె వయస్సుముదిరినవాఁడుగను, పొట్టివాఁడుగను, స్థూలకాయుఁడుగను,— ఇంతయేల మనము కథలలోఁ జదువుచుండెడు ప్రజాపీడన కార్యతత్పరులగు రాక్షసాకారపు రాజులవలె— ఇతఁడుండియున్న యెడల ఆమె యెక్కువగ సంతోషించి యుండును. ఒండొరుల పరిచయ సంభాషణములు ముగిసి, అందరు కూర్చుండిన నప్పుడు రాజాసాహెబ్! 'దరిద్రనారాయణ' పత్రిక సంపాదకురాలను నేనే'' యని చెప్పునంతటి ధైర్యము శ్రావణికి లేకపోయెను.

రాజావారికి లక్ష్మణరావుగారి కుటుంబముతో అత్యంత మైత్రి కలదు. ఆశ్లేషయు, రాజావారు చిన్ననాఁటినుండి నెచ్చెలులు. అందుచే వారిలో వారికి ఎట్టి బిడియములును లేవు. అదిగాక ఆశ్లేష విద్యావతి. పాశ్చాత్యనాగరకత ననుసరించి శిక్షితురాలయిన యువతి.

రాజావారొక పీఠముపై గూర్చుండి ఆశ్లేష యందిచ్చిన పానీయమును ద్రావి వారితో ఆనంద సంభాషణలు గావింపసాగెను. శ్రావణి చాలవరకు మౌనముగాఁ గూర్చుండెను గాని యంతలో రాజాగారి మాటలలో నొకటి యామె కర్ణములంబడి తత్ఖండనమునకుఁ బురికొల్పెను. రాజావారామెతోఁ జాలసేపు చర్చించిరి. ఆమెనుజూచి యాతఁడు చేసిన మందహాసము స్త్రీల మందహాసమువలె మనోజ్ఞముగా నుండెను. వారిద్దరి వాదనలలో రాజావారిదే పైచేయిగా నున్నదని లక్ష్మణరావుగారు తలంచిరి. వారందరును తోఁట లోనికి వెళ్ళి విహరించుచున్నప్పుడు రాజావారు అందలి ఫలవృక్షములను గూర్చియు, పూలచెట్లను గూర్చియు అతి వివరముగ ముచ్చటింపసాగిరి. అతఁడు ఉద్యానకృషిలో గట్టి నేర్పరి. శ్రావణి వారిని విడిచి ఇంటిలోనికిఁ బోయెను. అప్పుడు రాజావారామెను గురించి యాశ్లేష నడిగిరి. ఆశ్లేష కొంటెతనముగాఁ గన్నుకొట్టి, ఆమె తన సహాధ్యాయిని యనియు, తన కత్యంతప్రియ స్నేహితురాలనియు, తమవద్ద కొద్దిదినములుండి పోవచ్చిన దనియు తెలిపెను. 'దరిద్రనారాయణ' పత్రికను గూర్చి ఎంతమాత్రము ననుడువలేదు.

రాజా రామభూషణరావు సాయంకాలమగువరకచ్చటనే యాగెను. అతనినిఁ బ్రార్థించిన యెడల, భోజనమున కచ్చటనే యాగియుండునేమో యని మా యూహ. అయితే ఆశ్లేష యట్లు ప్రార్థించుటకు భయపడినది. లక్ష్మణ

రావు భోజనశాలలో రక్తపాతమగుట కెంతమాత్రము అభిలషించలేదు. కావున రాజావారు అత్యంత యాలోచనా మగ్నహృదయముతో వెడలిపోయిరి. అట్టి ఆలోచనా పరంపరలలో నొక్కటి శ్రావణి యంతటి చక్కని స్త్రీని తానెన్నఁడు చూడలేదనియు, లేదా శ్రావణివలె తన మనస్సును హరించిన స్త్రీ మఱియొకతె లేదనియు.

మరునాఁడు రాజావారు లక్ష్మీరంగమున్న మార్గమునసే 'పోవుట తటస్థించెను!' విషయము స్వల్పమై చీటివ్రాసి తెలిసికొనుట కవకాశమున్నను, లక్ష్మణరావుగారితో స్వయముగా సంప్రతించుటకు లోపలికి వచ్చెను. ఈ సారి మాత్రి మాయనను భోజనమున కాపిరి.

రాజావారు మొగబిడియము. అధికార ధూర్వహత్వము, గర్వము లేక కులాసాగా మాటాడు యువకుఁడగుటచే నత్యంత ప్రమోదచిత్తముతో విందు నారగించెను. అట్టి ప్రమోదమునందు ఆ యువతులిద్దఱును బాల్గొనిరి. శ్రీవణి సంపాదకీయ పదవినిఁ గూర్చి అతనికి దెలుపనందున అచ్చట రక్తపాత మేమియుఁ గాలేదు. ఆయన కెందుకు తెలుపలేదో మేము వచింపఁ జాలము. శ్రావణి తన మానమున కెన్నో సమాధానములు తనలోఁ దాను జెప్పకొనిన సమర్థింపఁ బూనుకొనెను. కాని యంత జయప్రదము రాలుకాకపోయెను. ముసిముసి నవ్వులు నవ్వుచున్న లక్ష్మణరావుతో సంపాదకునకు వ్యక్తిద్వేషము పనికిరాదనియు, వార్తాపత్రికా

వివాదములను గృహస్థుల శాంతమందిరముల లోనికిఁ దెచ్చుట కూడదనియు, ఆమె వివరించెను. ఆమె యెంత చాకచక్యముగఁ జర్చించినను, ఆమె యంతరాత్మమాత్రము ఆమెను బాధింపసాగెను. ఆ బాధ ఆరాత్రి నిద్రపట్టనీయ నంతటి తీవ్రముగా నుండెను. తెల్లవారు సరికి రాజావారి వద్దినుండి ఆ ముగ్గురికి సాయంకాలము రావలసినదిగా ఆహ్వానలేఖలు వచ్చెను.

శ్రావణి పోవుటకు తిరస్కరించెను. కాని, ఆమె వెళ్లినది. వెళ్ళుచు నొక తీర్మానమును గూడ వెంటఁ గొని పోయెను. రాజా రామభూషణరావు పత్రికలోని తీవ్ర విమర్శనములను నిర్లక్ష్యము చేసియున్నాఁడు. ఇప్పుడు ముఖాముఖని చర్చించుటకుఁ 'గృతనిశ్చయురా లయ్యెను.

బంగళా డాబాపై వారందరు తేనీరు త్రాగుచున్నప్పుడు ఆమె సూనముద్రను ధరించెను. ఆయన వారికి శిథిలావస్థ యందున్న పశ్చిమభాగములను జూపించుచున్నప్పుడు ఆమె కవకాశము లభించెను. దానిని గ్రహించెను.

"దీనిని బాగుచేయించ వలయునని అనుకొనుచున్నాను. అది భక్తిపూర్వకముగా నొనర్చెదను. శ్రావణీ! నీకిది సమ్మతముగా నుండునని భావించెదను" అని యాతఁడనెను.

తన మెప్పుకోలును గోరుట యెందుకా యని శ్రావణి ఆశ్చర్యపడెను. కాని ఆమె యెంతమాత్రము కనికరము జూపక వెంటనే యాతనిపై అగ్నివర్షము కురిపించ సాగెను. ఆతడు దులికిపడునంత సూటిగ నగరములోని యనారోగ్యకర ములగు నిండ్లనన్నింటిని ఆయన తిరుగ గట్టించిన యెడల ఆమెయు ప్రపంచములోని వారందరును మిగుల సంతసించె దరని యాతనితో బలికెను. ఫ్యాక్టరీలలో బనిచేయు కూలి వారి దారిద్ర్యమునుగూర్చి ఉపన్యసించెను. వారి దుర్భరస్థితి అవమాన కరమనియు, సిగ్గులచేటనియు నామె వక్కాణించెను. ఆమె నగరోద్యానము పేరుకూడ నెత్తెను. ఆమె స్వనము ఎంత మధురముగ, ఎంత వీనులవిందుగ నున్నను, ఉద్యానవనమును ప్రజలకు విడిచివేయుట యాతని విధికృత్య మని ధైర్యముతో గట్టిగా వాదించెను.

రాజా రామభూషణరావు కొంచెము విభ్రమము చెం డెను. 'శ్రావణీ! నీవు 'దరిద్రనారాయణ' పత్రికను జదువు చున్నట్లు లున్నదే' అని సుస్వభావ మందహాసముతో నత డనెను.

శ్రావణి మొగము కందగడ్డ యయ్యెను.

'నేను చదువుచునే యున్నాను. ఆ పత్రిక చెప్పెడు ప్రతిపదముతో నే నేకీభవించెదను.' అని యామె బదులు పలికెను.

'చూచితివా! నేను చాల బీదవాడను. సంస్థానము అప్పులపాలై—'

'ఈ భాగమును నీవు తిరుగఁ గట్టించఁ దలంచు కొన్నావు గదా' అని బాలిక మాటాడు గలుగనంత నిమ్మళముతో గట్టిగ ననెను.

'అవునవును, అట్లే తలంచినాను.' అని యతఁ డొప్పు కొనెను. 'నేను కొన్ని గుఱ్ఱములను అమ్మివేయవలసి యుం డును. కొన్ని బీళ్లను వదులుకొనవలసి యుండును. ఇంక ననేకవిధముల వ్యయములను తగ్గించవలసి యుండును.'

'గుఱ్ఱముల నమ్మివేయుము. బీళ్ళను వదలుకొనుము. రామపురములోని ప్రజలక్షేమార్థము వ్యయములను తగ్గించు కొనుము.' అని సంస్కార పరాయణురాలు వచించెను.

రాజా కొంచెమునే పూరకుండి యిట్లనెను:—

'నేను దీనినిఁగూర్చి యాలోచించెదను.' దానినిఁ గూర్చి ఆలోచించినాఁడు. కాని శ్రావణిని గూర్చియే విశే షముగ నాలోచించినాఁడు.

ఇన్ని మాట లెందుకు ? ఆయన యామెను వలచి నాఁడు. తన యింటికి వచ్చి, తన యింట్లో తన్నాక్షేపంచిన యామె ధైర్యము మరింతఁ వలపింపఁ జేసినది. ఆమె సాంగత్యము తన కత్యంతావసరమని యభిప్రాయ పడెను. ఇంత వరకు ఉల్లాసముగాఁ గడపిన తన జీవితము ఆమె లభింపనిచో వ్యర్థమని నిశ్చయించు కొనెను.

౪

రాజా రామభూషణరావు బహద్దరు అయిదుదినముల వరకు లక్ష్మీరంగమునకు రాలేదు. ఈ మధ్యకాలములో నతడు శారివణి నెన్నిమారులు స్మరించెనో అన్నిసార్లు ఆమెయు నాతని స్మరించెననియు మేము ఒప్పుకొనక తప్పదు. తా నాతనియెడ అవినయముగఁ బ్రవర్తించి యాతనికిఁ గోపము పుట్టించినట్లు ఆమెకు స్పష్టముగాఁ దోఁచెను. అందుకై యామె చాల పశ్చాత్తాపము పడెను. అయితే తాను తన విధికృత్యమును నెరవేర్చినట్లుగా భావించి శారివణి మనస్సమాధానము చేసికొనెను. ఇట్టి సమాధానము లెల్లప్పుడును పేదరికమును వెల్లడి చేయుచుండును. శారివణి విషయములో నా పేదరికము అత్యంత భయంకరముగా నుండెను.

అయిదవ దినమున రాజా రామభూషణరావు లక్ష్మీరంగమునకు వచ్చినప్పుడు, లక్ష్మణరావు ఆశ్లేష సమీప గ్రామములోని బంధుదర్శనమునకు వెళ్లియుంటచే శ్రావణి యొక్కతెయే యుండెను. వారు ఇంటిలో లేనందులకు రాజావారు విచారపడినట్లు కనఁబడలేదు.

'శారివణీ! నీ దర్శనము చేసికొనవలయునని వచ్చినాను సుమా' అని రాజావా రనిరి.

శారివణి కొంత విస్మయచిత్తురా లయ్యెను. వెంటనే తాను వాదించిన సంస్కరణ విధానములను జర్చించుటకు

వచ్చియుండునని భావించెను. కావున అతఁడేమి చెప్పునో వినుటకు వేచియుండెను. రాజా యొక కుర్చీని ఆమె కుర్చీ వద్దకు లాగుకొని మిగుల నెమ్మదిగ, నారీజనులు వినుట కభిలషించెడు మనోహర స్వరముతో నిట్లనెను:—

"శ్రావణీ! నిన్ను నేను ప్రేమించినాను. నాకు భార్య వగుటకుఁ గోర నిశ్చయించుకొని వచ్చినాను."

శ్రావణి సంభ్రమ చిత్తముతో నాతనిఁ బరికించెను. వెల వెలఁ బోయెను. వ్యసనాయత్త చిత్తముతోఁ బీఠము నుండి లేచెను. కాని రాజా ప్రార్థనసూచకముగాఁ జేయి యడ్డము పెట్టెను.

"దయచేసి వెళ్లకుము. నే నంత నైపుణ్యముగ విషయమును బహిరంగ పరుచలేదని భయపడుచున్నాను. అయితే ఈ దినములం దంతటను ఈ విషయమును గూర్చియే ధ్యానించుచుంటిని. నా నిరంతర ధ్యానముచే నీకీవిషయము బోధపడి యుండునని భావించినాను. కాని యిట్టి భావ మసంగతమైనదే. నా యసంబద్ధ సంభాషణమునకు నన్ను క్షమింపుము. నేను నిన్ను మనస్ఫూర్తిగ ప్రేమించితి నని విశ్వసించుము. నీవు నా ప్రేమ నంగీకరించి, నాకు భార్యవగుటకు వాగ్దానము చేసినచో నిన్ను సంతోషపెట్టుటకు అత్యంతము కృషి సల్పెదను. అయితే నేనో నీకు తగినవాఁడను కాను. నీవో. నేను జూచిన వారలలో అత్యంత సౌందర్యవతివి. అధిక

ప్రజ్ఞావంతురాలవు. అందుచేతనే నిన్ను ప్రేమించకుండ నుండఁజాల నని భావించితిని. సరే యనెదవా?'' అని రాజా వినయముగా నడిగెను.

"ఊహూఁ" అని శ్రావణి యనెను. అనఁగా నామె పెదవు లనెను. ఆమె హృదయము ప్రస్ఫుటముగా 'ఆఁ' అనెను. కాని రాజాగారు ఊహూఁ మాత్రమే వినఁగలిగిరి.

ఆయన కొంచెముసే పూరకుండి, ఏదో గొప్ప యపాయము సంభవించినట్లుగా నిట్టూర్పు విడచెను.

రాజా హీనస్వరముతో నిట్లు మాటాడసాగెను.

"క్షమించుము. నీ మనస్సును మార్చుకొందువని నే భావించను. కావున ఇక నీ విషయమున నిన్ను బాధింపను. ఇది నాకు గొప్ప దెబ్బ యనుటకు సందియము లేదు. నే ననుకొనినటులే జరిగినది. నాకు తెలిసినంతవరకు నీవు నన్నెందులకు ప్రేమించ వలయునో కారణ మగుపడదు."అని పీఠమునుండి లేచుచు, జేబులోనుండి యొక కాగితముల కట్టను తీసెను. 'శ్రావణీ! ఇది నీ కియ్యఁదలఁచు కొన్నాను. ఇది నగరోద్యానమును గూర్చిన దానపత్రము. నగరోద్యానమునకు గ్రామకరణమును, లక్ష్మణరావుగారిని ధర్మకర్తలుగ నియమించి, దానినిఁ బ్రజల యుపయోగమునకు వదలి వేసినాను. ఇది నీ సూచనగాఁబట్టి దానిని వారి కీయవెంచి

తిని. ఇప్పుడు నీవు నన్ను అంగీకరించలేదు. కావున నీకే యియ్యఁగలను.'' అని రాజా పలికెను.

శారివణి కంపిత హస్తముతో నా పత్రమును అందుకొని, అట్టి పనిచేసినందుల కాతనికి సహజముగాఁ బలుకవలసిన ధన్యవాదములు పలుకక ప్రకంపితస్వనముతో ఎంతో కష్టముమీఁద నిట్లయెను:–

''అదేమి– అదేమి– నే నంగీకరించక పోయిన?''

''సంగతి సందర్భము లివి. నీవు నన్నంగీకరించి యున్నయెడల, ఈ విషయములో నీతో సంప్రతింపవలసి యుండుట యుక్తము. నగరోద్యానమును విడిచి వేయుటచే నే నింకను బీదవాఁడ నగుచున్నాను. నాభార్య కిష్టముగాకపోవచ్చును. ఆమె స్నేహితురాండ్రు అంత గొప్ప యాస్తిని అట్లు పరిష్కారము చేయుటకు నా కధికారము లేదని భావింపవచ్చును. అయితే ఇప్పు డంతయు సరిగానే యున్నది. నే నిఁక వివాహమే యాడను. నేను దేశాంతరములకుఁ బోయెదను. సెలవిమ్ము. నీకు శుభమగుగాక! దయయుంచుము.'' అని పలికి రాజా రామభూషణరావు శీఘ్రగమనమున బయలుదేరెను.

ఆతఁడు దృష్టి కగోచరుఁడు కాఁగానే, శారివణి, ఆ పత్రము అట్లే చేతులలో నుండఁగా రెండుచేతులతోఁ గన్నులను మూసికొని ఏడువసాగెను. ఆమె యట్లేడ్చుచు

పరధ్యానముగా నుంటచే నాతఁడు మరల వచ్చుటయే ఆమె చూడలేదు.

"శ్రావణీ! ఇంకొక విషయము చెప్పుట మరచిపోయి నాను" అని అతఁ డనఁగానే యామె మొగమును ద్రిప్పి తన కన్నీటిని మరుగు పరుచుటకుఁ బ్రయత్నించెను. "దరిద్ర నారాయణ" పత్రికా సంపాదకునిఁ గూడ నొక ధర్మకర్తగాఁ బేర్కొన్నాను. ఇది నీ కిష్టమేకదా? అతఁడు కొంత దుర్భాషను బ్రయోగించినాఁడు. అయినను ఆతని వాదము సమంజస మైనదే" అని రాజా అనెను.

ఈ నిప్పుల వర్షము శ్రావణికి దుర్భరమయ్యెను. కన్నీటిధారలు వరదలుగా చెక్కిలపై జారుచుండ నాతని వైపుఁ దిరిగెను.

"దరిద్రనారాయణ" పత్రికా సంపాదకురాలను నేనే. ఆ వ్యాసములను వ్రాసినది నేనే." అని యామె వెక్కి వెక్కి యేడ్చుచు గద్గదస్వరముతోఁ బలికెను.

అతఁడు నివ్వెఱపడి చూచెను.

"నీవా! సరే. నీవు చేసినది మంచిపనియే. నీవు అందులకు గర్వించుట యుక్తము." అని రాజా పలికెను.

"నే నందులకు గర్వించుటలేదు. నేనందులకు మిగుల సిగ్గుపడుచున్నాను" అని యా యభాగ్య సంపాదకురాలనెను.

"సరిసరి, బాగున్నది. నీవా దేనినిఁ గూర్చి యైనను సిగ్గుపడవలసిన దానవు! నాయందు దయయుంచి దానినిఁ గూర్చి యేడ్వకుము. నీ వేడ్చుచుండుట చూచినచో నామన సెంత నొచ్చుకొనునో, నేను దూరదేశములో నున్నప్పుడు ఈ దృశ్యము జ్ఞాపకమునకు వచ్చి, నన్నెంత యాకులపాటు చేయునో నీవు గ్రహింపఁగలిగిన యెడల—"

"నేను—దానినిఁ గూర్చి—ఏడ్చుటలేదు." అని శ్రావణి తన కన్నీటిధారలతోఁ బెనఁగులాడుచు ననెను.

"మరెందుకు?"

ఆమె ప్రత్యుత్తర మొసఁగలేదు. అనఁగా మాటలలో. కాని యొక్కొకసారి కన్నులే మనస్సునందలి భావములను జక్కఁగఁ బ్రకటింపఁ గలవు. ఆతఁడు తనచేతులు చాచెను. ఆమె యాతని కౌఁగిటిలో వాలెను.



ఇప్పుడు నగరోద్యానమునందు పక్షులు సౌఖ్యముగా విహరించుచున్నారు. రాజారామభూషణరావు బహద్దరువారి భవనముల పునర్నిర్మాణపుఁ బని అభివృద్ధికరముగా జరుగుచున్నది. లక్ష్మణరావు గారింకను ముసిముసినవ్వులు నవ్వుచునే యున్నారు. రామపుర సంస్థాన రాజపత్నియగు రాణీ శ్రావణీదేవి దరిద్ర—లేక యేయితర— నారాయణను బ్రకటించుటలేదు.



పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు
రచించిన గ్రంథములు.

---

## ప్రాచీన ఆంధ్రనగరములు.

ఒక కాలమందు ఆంధ్రరాజన్యుల రాజధానులుగ పరిఢవిల్లి, అందచందములతో నొప్పుచు కీర్తివైభవములను గడించి నామమాత్రావశిష్టములైన అలంపురము, ఆనగొంది, కల్యాణి, కొండాపురము, కొలనుపాక, గోలకొండ, పానుగల్లు, ప్రతిష్ఠానము, భోనగిరి, రాచకొండ, వరంగల్లు, వేల్పుగొండ— అను పండ్రెండు నగరముల చరిత్రములు పరిశోధన పూర్వకముగ రచింపఁబడినవి. ప్రాచీనాంధ్రుల వీరవిహారములు, శిల్పచాతుర్యములు, సారస్వత కృషులు, వాణిజ్యాది విశేషములు, ప్రతిభా సంపదలు ఈ గ్రంథము వెల్లడిచేయుచుండును. ఇట్టి వర్ణనాత్మకమగు గ్రంథము ఆంధ్రభాషయందిది యొక్కటియే. పటములు గలవు.

పుటలు 126 — వెల 2–0–0

## రత్నప్రభ.

ఇది "అరేబియన్ నైట్సు" అను గ్రంథము నందలి "అలాయుద్దీన్ విచిత్రదీపము" అను రమ్యకథ. దేశముల పేర్లు, మనుష్యుల పేర్లు మార్చి మన పేర్లు పెట్టి కథ సుపరిచయము చేయబడినది. సరళమయిన శైలి, అద్భుత విషయములతో నిండియున్న కథ.

పుటలు 75 — వెల 0-12-0

లభ్యము వారిః—

ఆంధ్రా బుక్ హౌస్

సుల్తాన్‌బజార్ — హైదరాబాదు.

